**జానపద సాహిత్య వ్యాసతోరణం**
(వ్యాస సంపుటి)

**JANAPADA SAHITYA VYASA TORANAM**
(Vyasa Samputi)

రచయిత : **డా. దాసర విజయకుమారి**
అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలుగుశాఖ,
హైదరాబాదు విశ్వవిద్యాలయం.

Author : **Dr. D. Vijaya Kumari**
Asst. Prof. Telugu
University of Hyderabad.

| | | |
|---|---|---|
| ముద్రణ | : | జూన్, 2019 |
| ప్రతులు | : | 500 |
| వెల | : | **100/–** |

| | | |
|---|---|---|
| Print | : | June, 2019 |
| Copies | : | 500 |
| Price | : | **100/-** |

*ప్రచురణ :*
**సూర్య పబ్లికేషన్స్**
శ్రీనిలయం, ఫ్లాట్ నెం. 302
C-13/A హుడా కాంప్లెక్స్,
సరూర్‌నగర్,
హైదరాబాదు–500 035

*Publications*
**SURYA PUBLICATIONS**
Srinilayam, Flat No.302
C-13/A Huda Complex,
Saroornagar,
Hyderabad-500 035

*ముద్రణ*
**ఓం సాయి గ్రాఫిక్స్**
3–4–709, నారాయణగూడ,
హైదరాబాదు.

*Printing*
**Om Sai Graphics,**
3-4-709, Narayanaguda,
Hyderabad.

**ISBN : 978-93-5268-826-5**

# అమ్మనాన్నలు

## శ్రీమతి దాసర దేవకరుణమ్మ, శ్రీ అభిమన్యుడు



పొలాలను హలాలదున్నే కర్షక జీవి నా తండ్రి

తన తల్లిదండ్రుల కోరిక మేర చదివిన చదువును, సంపాదించిన ఉద్యోగాన్ని అవలీలగా
విడిచిపెట్టి వారి ఆత్మీయానుబంధాలతో బందీ అయి కృషీవలుడుగా మారిన కష్టజీవి.
ఆయన అడుగు జాడలలో నడిచిన సహధర్మచారిణి నా తల్లి.
సంతానాన్ని ఉత్తమ వ్యక్తులుగా తీర్చిదిద్దిన వారు.
ఎటువంటి పరిస్థితుల్లోను వ్యక్తిత్వం మార్చుకోకూడదని అమ్మ నేర్పిన పాఠం
నాకు ఏ నాటకీ ఆచరణీయమే.
తమ సంతానం అభివృద్ధిని మాత్రమే ఆకాంక్షిస్తూ వారి నుండి ఏమి ఆశించకుండ,
ఎటువంటి విలాసాలను కోరుకోకుండ అతిసాధారణ జీవితాన్ని గడుపుతున్న
నిరాడంబర జీవులు అమ్మనాన్నలు.
ఈ వ్యాసతోరణంతో వారి పాదపద్మాలను అర్చిస్తున్నాను.

– దాసర విజయకుమారి



# శుభాశీస్సులు

**వి**హిత కర్మాచరణను అంతఃకరణ శుద్ధితో నిర్వహించడం ధర్మం అని, దానిని ఆచరిస్తే పుణ్యం సిద్ధిస్తుందని ప్రాచీనుల నిర్ణయం. ఆధ్యాత్మికతను సామాజికతతో సమన్వయించిన ఈ సిద్ధాంతం ఉన్నత జీవనానికి ప్రాతిపదిక. చదువు సంస్కారాలలో చదువు సామాజికం, సంస్కారం జీవలక్షణం. సంస్కారంతోనే చదువు అర్థవంతం చైతన్యవంతం అవుతుంది. ఇటువంటి జీవన శైలితో కర్తవ్యాన్ని నిర్వహిస్తూ ఆదర్శ జీవనం చేసేవారు మన మధ్యే ఉంటారు కదా.

ఈ నేపథ్యంలో చి॥సౌ॥విజయకుమారిని అభినందిస్తున్నాను. ఆమె మా విశ్వ విద్యాలయంలో నాతో పరిశోధన చేసి, అధ్యాపకురాలుగా కొనసాగుతున్న విదుషీమణి కావడం నాకానందదాయకం. ఆమె ప్రచురిస్తున్న వ్యాసతోరణం రాబోయే రోజుల్లో ఆమె నిర్మించబోయే పరిశోధన సౌధానికి స్వాగత ద్వారం.

ఆమె అన్ని రంగాలలోను విజయం సాధిస్తూ సార్థక నామధేయురాలు కాగలదని ఆశిస్తూ శుభాశీస్సులు అందజేస్తున్నాను.

హైదరాబాదు
1-6-2019

**నడుపల్లి శ్రీరామరాజు**
విశ్రాంత తెలుగు ఆచార్యులు
హైదరాబాదు విశ్వవిద్యాలయం



# కృతజ్ఞతలు

**"మా**తృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ" అన్న వాక్యాలు నా విషయంలో సార్థకమయ్యాయని చెప్పవచ్చు. తల్లిదండ్రుల ఋణం తీర్చుకోడమనేది సాధ్యంకానిది. మా గురువుగారు ఆచార్య నడుపల్లి శ్రీరామరాజుగారు ఆయన సతీమణి నన్ను వారి పెద్ద కూతురుగా భావించి, నిరంతరం నా ఉన్నతిని ఆకాంక్షిస్తూ ఉంటారు. వారి ఆశీర్వాదమే నాకు కొండంత అండ. వారిరువురికి నా కృతజ్ఞతాభివందనాలు.

మా అన్నగారు గోవర్ధనరావు, తండ్రి తరువాత తండ్రిలాంటి వ్యక్తి. నేను ఎమ్.ఎ. చదవడానికి ప్రోత్సాహాన్ని, ఆత్మబలాన్ని అందజేశారు. అతి చిన్న వయస్సులోనే తండ్రికి అండగా నిలిచి అన్నదమ్ముల, అక్కచెల్లెళ్ళ చదువులకు కావలసిన సహాయాన్ని అందించారు. అన్నయ్యకు అన్నివేళలా అండగా నిలిచే వదిన వసుంధరకు కృతజ్ఞతలతో కూడిన ఆత్మీయాభివందనాలు. నాకు ఆప్యాయతానురాగాలను పంచే అక్కా చెల్లెళ్ళకు, తమ్ముళ్ళకు నా కృతజ్ఞతలు.

పై విషయాలన్ని ఒక ఎత్తైతే, నా భర్త నాకు అందించే సహకారం మరోఎత్తు. ఏ బిడ్డనైనా తల్లిదండ్రులు చదివించడం సర్వసాధారణం. కాని వివాహమైన తరువాత భర్త భార్యను చదివించడం అరుదైన విషయం. నా చేత పిహెచ్‌డి చేయించి, సమాజంలో నొకొక స్థానాన్ని కల్పించారు. నేను సాధించే ప్రతి విజయం వెనుక ఆయన ప్రోత్సాహం ఉంది. ప్రతి పురుషుడి వెనుక ఒక స్త్రీ ఉంటుందనేది ఆనాటి మాట. ప్రతి స్త్రీ విజయం వెనుక ఒక పురుషుడు ఉండాలనేది నేటి మాట. మంచి భర్త లభించకపోతే ఆ స్త్రీ జీవితం అంతటితో ఆగిపోతుంది. అలా ఆగిపోకుండా నిరంతరం ప్రోత్సహిస్తూ ముందుకు నడిపించే నా భర్తకు కృతజ్ఞతలు చెప్పడం మాటలకు అందనిది. మా కుమారుడివల్ల మాకు కలిగే ఆనందం అనిర్వచనీయం. వివాహమైన తరువాత మా అత్తగారు, మామగారు నాపట్ల చూపిన ఆప్యాయతానురాగాలు చెప్పనలవికానివి. మా మామగారిని చూడడానికి వెళ్ళిన ప్రతిసారి

ఏదో ఒక పుస్తకాన్ని ఇచ్చి చదవమని చెబుతారు. తర్వాత చదివానో లేదో అడుగుతారు. ఈ ఒక్క విషయం చాలు ఆయన దృష్టిలో నేనేమిటి అనేది. ఆయనకు హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనాలు. మా అత్తగారు స్వర్గస్థులైన ఆవిడ ఆశీస్సులు నాకు ఎప్పుడూ ఉంటాయి.

నాకు క్షేత్ర పర్యటనలో సహకరించి "కొలుపులు", "పోలేరమ్మ జాతర"ల గురించి తెలియజేసిన జి. సుబ్బరామయ్య గారికి "పెద్దగట్టు జాతర" గురించి చెప్పిన జంగయ్య గారికి ప్రత్యేక కృతజ్ఞతలు.

ఈ పుస్తకాన్ని డి.టి.పి చేసి ప్రచురణకు సిద్ధం చేసిన ఓం సాయిగ్రాఫిక్స్ సిబ్బందికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.



# విషయ సూచిక





# ప్రస్తావన

**జా**నపద సాహిత్య వ్యాసతోరణం అనే గ్రంథంలో 12 పరిశోధన వ్యాసాలున్నాయి. మొదటి నాలుగు వ్యాసాలు జానపద విజ్ఞానానికి సంబంధించినవి. 5, 6 వ్యాసాలు జానపద కళారూపాలకు సంబంధించినవి. 7వ, 8వ వ్యాసాలు యక్షగానాలకు చెందినవి. 9 నుంచి 12 వరకు ఉన్న వ్యాసాలు గ్రామ దేవతలు, ప్రజల సంప్రదాయాలు, నమ్మకాలు సంస్కృతిని తెలియజేసేవి. మొదటి వ్యాసమైన జానపద సాహిత్యం–సంస్కరణ దృక్పథం అనే దానిలో "శిష్ట సాహిత్యంలో వలెనే జానపద సాహిత్యంలో కూడా సంస్కరణ దృక్పథం ఉంది అనే విషయాన్ని చర్చించాను. మూడవ వ్యాసంలో జానపదులు పాడుకునే గేయాలలో హాస్యం ఏవిధంగా ఉందో అధ్యయనం చేశాను. నాలుగవ వ్యాసం కాటమరాజు కథలకు సంబంధించినవి దీనిలో ముఖ్యంగా చర్చించినది కథన ఘటకాలు అనే అంశం కథ ముందుకు నడవడానికి ఉపయోగపడేవి కథన ఘటకాలు. కాటమరాజు కథలలో బసవన్న పూజలు, బ్రాహ్మణుల జోస్యము, పెంపుడు చిలుక, గంగ, దేవతా బొంగరాలు, శకునములు మొదలైన కథన ఘటకాలు ఉన్నాయి. వాటిని పరిశీలించినప్పుడు ఆ సంఘటన జరగకుండా ఉండి ఉంటే కథ ముందుకు నడిచేదికాదనే భావన కలుగుతుంది. ఐదవ వ్యాసం జానపద కళారూపాలు– దళితులు అనేది. జానపద కళలు కొన్ని కులాల వారికి వంశపారంపర్యంగా వస్తున్నాయి. నేటి సమాజంలో ఆ కళలకు సరైన ఆదరణ లేకపోవడం వల్ల కొంతమంది కళాకారులు వేరే వృత్తులను అవలంభిస్తున్నారు. హరినామ సంకీర్తనలు, తత్త్వాలు, పంచకథలు, బైనీటికథలు పల్నాటి కథలు, కొమ్ము కథలు, వీధినాటకాలు, సోదికథలు, మాతంగి నృత్యాలు, డప్పులు వాద్యాలు కర్రసాములు మొదలగునవి వీరు ఆచరించే కళలు. వీటిని పరిశీలించాను. 6వది జానపద నృత్యం తప్పెటగుళ్ళు అనేది. విజయనగరం జిల్లా బిలిజిపేట అనే గ్రామంలో జరిగిన ముగుడాలమ్మ జాతర సందర్భంగా తప్పెటగుళ్ళు ప్రదర్శించారు. ఆ జాతరలో పాల్గొని ఆ నృత్యాన్ని ప్రత్యక్షంగా వీక్షించి ఈ కళారూపాన్ని ఏవిధంగా పరిరక్షించుకోవాలో ఈ వ్యాసంలో చర్చించాను. 7వది యక్షగానాలు– వస్తు వైవిధ్యం అనే వ్యాసం. యక్షగానాలలోని పౌరాణికాలు, చారిత్రకాలు, సాంఘికాలు, కాల్పనికాలు, క్షేత్ర మహాత్మ్యాలు అనే వాటిని ఈ వ్యాసంలో అధ్యయనం చేశాను. 8వ వ్యాసం బాలకృష్ణ నాటకము (యక్షగానము)–విశ్లేషణ.

రచయిత్రి తరిగొండ వెంగమాంబ పరిచయం, ఆమె రచనలు, యక్షగాన విశ్లేషణతోపాటు, పరిష్కరణ విషయాలను ఈ వ్యాసంలో చర్చించాను.

కొలుపులు అధ్యయనం అనే వ్యాసం క్షేత్ర పర్యటన ద్వారా సేకరించిన సమాచారం ఆధారంతో రచించినది. ఈ వ్యాసంలో కొలుపులు ఏవిధంగా నిర్వహిస్తారు. ఆ సందర్భంలో గ్రామస్తుల ఆచార, సంప్రదాయాలు, పూజా విధానం మొదలైన అంశాలు వివరించాను. 10వ వ్యాసం పోలేరమ్మ జాతరకు సంబంధించినది. కారుమంచి గ్రామస్తులు పూజించే అంకమ్మ తల్లి అనే దేవతకు సంబంధించిన అంశం. ఈ వ్యాసంలో చర్చించాను. 11వ వ్యాసం పెద్దగట్టు జాతర ఈ జాతర తెలంగాణ రాష్ట్రంలోని నల్లగొండ జిల్లా సూర్యాపేట తాలూకాలో గల దురాజ్‌పల్లి గ్రామ ప్రజలు జరుపుకునేది. ఈ వ్యాసంలో జాతర జరిపే విధానం, ప్రజల నమ్మకాలు మొదలైన అంశాలున్నాయి. చివరి వ్యాసం పెద్ద పండుగ పరిశీలన ఈ వ్యాసంలో తెలంగాణ ప్రజలు ఈ పండుగ జరుపుకునే విధానం, వారి సంస్కృతి, ఆచార సంప్రదాయాలు, నమ్మకాలు మొదలైన విషయాలున్నాయి.

ఈ విధంగా వివిధ అంశాలకు సంబంధించిన వ్యాసాలు ఈ గ్రంథంలో పొందుపరిచాను.



# 1. జానపద సాహిత్యం - సంస్కరణ దృక్పథాలు

**జా**నపద సాహిత్యం ఎప్పుడు ఉద్భవించిందంటే మానవుడు పుట్టినప్పుడే అని చెప్పవచ్చు. మానవుడి పుట్టుక గురించి తెలిస్తే జానపద సాహిత్యం పుట్టుక గురించి తెలుస్తుంది. జానపద సాహిత్యంలో భాగమైన గేయం, కథాగేయం, సామెత, పొడుపు కథగాని, ఇతర కళారూపం గానీ పండుగకు సంబంధించినది గాని జాతరలకు ఏదైనా ఆధారం లభించినప్పుడే దాని పుట్టుక గురించి ఆలోచించవచ్చు. అటువంటి ఆలోచనల ద్వారా జానపద సాహిత్య చారిత్రక నేపథ్యాన్ని నిర్మించవచ్చు. ఈవిధానంలో ఎన్నో శాస్త్రాలు సహాయపడతాయి జానపద సాహిత్యం పుట్టుపూర్వోత్తరాలను పరిశీలించడానికి మూడు లక్షణాలున్నాయి."1. బహుప్రదేశ అస్థిత్వం కలది 2. శాస్త్రీయ స్పర్శలేనిది 3.ఎక్కువగా ఊహాత్మక లక్షణాన్ని కలిగినది".

*(కృష్ణకుమారి, నాయని. 2000 : 65)*

జానపద సాహిత్యం బహుప్రదేశ అస్థిత్వం గలది. లాలిపాటలు జోలపాటలు తెలుగు, కన్నడ, తమిళ, మలయాళ భాషలోనే గాక ఇతర భారతీయ భాషలలోను, ప్రపంచంలోని అనేక భాషలలోను ఉన్నాయి. అలాగే నమ్మకాలు, సంప్రదాయాలు, కళలు మొదలైన వాటిలో కూడా పోలికలు కనిపిస్తున్నాయి. జానపద పురాణ గాథలలో సూర్యుడు వేడిగాను, చంద్రుడు చల్లగాను ఉంటాడు అని ఉంటుంది. ఆవిధంగా ఎందుకుంటాడు అనే విషయానికి శాస్త్రీయత ఉండదు. తమకు తోచిన కథను చెప్పుకుంటారు. అదే కథ తరువాత తరాలకు చేరుతుంది. ఇటువంటి మౌఖిక సాహిత్యమేగాక, ప్రాచీన ఆచారాలు సంప్రదాయాలు, నమ్మకాలు, అనేక పనిముట్లు, వస్తువులను తయారు చేసే విధానంలోను శాస్త్రీయత లోపిస్తుంది. అదే తరువాత తరాలకు చేరుతుంది.

ఈవిధానంలో ఏకోత్పత్తివాదం, బహుళోత్పత్తివాదం అని రెండు వాదాలున్నాయి. ఇవి జానపద సంస్కృతి అధ్యయనానికి, మానవశాస్త్ర అధ్యయనానికి కూడా అన్వయిస్తాయి. ఈ వాదంలో గేయం, సామెత, కళలు మొదలైనవి ఒక ప్రదేశంలో పుట్టి ఇతర ప్రదేశాలకు వ్యాపిస్తాయని కొంతమంది పండితులు నిర్ధారించారు.

ఏకోత్పత్తివాదాన్ని సమర్థించే వాటిలో చారిత్రక, భౌగోళిక సిద్ధాంతం ఒకటి. దీనికి ఫిన్నిష్ విధానమని పేరు. జూలియస్ క్రోన్, కార్లెకోన్ అనేవారు దీన్ని ప్రతిపాదించారు. ఈవిధానం ఎక్కువగా కథన రూపంలో ఉండే జానపద ప్రక్రియలకు అన్వయించి వాటి మౌలికతను కనుక్కోవచ్చు. బహుళోత్పత్తి వాదం ప్రకారం వివిధ ప్రదేశాలలోని జానపద విషయాలలో పోలికకు కారణం ప్రపంచ మానవుని భావైక్యం మాత్రమే అని మరికొందరు నిర్ధారిస్తారు.

**మనోవిశ్లేషణ సిద్ధాంతం :** హేతు రాహిత్యాన్ని విశ్లేషించి చూపే సిద్ధాంతాలలో మనోవిశ్లేషణాత్మక సిద్ధాంతం ప్రధానమైంది. కథలు మనకు వచ్చే కలల్ని పోలి ఉంటాయి. కలల్ని మనస్తత్వశాస్త్ర సహాయంతో విశ్లేషించినట్లైతే కథలు మొదలైన జానపద పక్రియల్ని కూడా విశ్లేషించవచ్చునని లైన్నర్ వంటి విద్వాంసులు భావించారు.

మనస్థత్వ శాస్త్రంలో మనో విశ్లేషణాత్మక సిద్ధాంతానికి మూలపురుషుడు సిగ్మంట్ ఫ్రాయిడ్. మనిషి, చేతన అచేతన స్థితులను ఫ్రాయిడ్ విశ్లేషించి చూపాడు. జానపద సాహిత్యం సమష్టి సృష్టేగాని, వ్యక్తి సృష్టికాదు. కొన్ని కథాగేయాలు, సామెతలు మొదలైనవి మొదట ఒక వ్యక్తి సృష్టించినవిగానే అనిపించినా అవి సామూహిక పునఃసృష్టిని పొందుతాయి.

**"ఆచారాకాండ :** ఆచారకాండ జానపద విజ్ఞానానికి మూలమనే అభిప్రాయం ఒకటి ఉంది. జానపద పురాణాలు, అచారాలు, పండుగలు, పండితులు మొదలైన వాటిని పరిశీలిస్తే ప్రాచీన కాలంనాటి కర్మకాండలకు సంబంధించిన విషయాలను పునర్మించవచ్చునని విద్వాంసుల అభిప్రాయం. జానపదుల నమ్మకాలు ఆచారాలు మొదలైనవే. మత సంబంధమైన కర్మకాండలకు మూలమని అందువల్ల కర్మకాండలు జానపద విజ్ఞానానికి మూలం కావడం సాధ్యంకాదని మరికొందరి విద్వాంసుల అభిప్రాయం వెలిబుచ్చారు".

*(కృష్ణకుమారి, నాయని. 2000 : 66, 67)*

పై విషయాల నన్నింటిని పరిశీలించినట్లైతే, ఆజానపదుల ఆచారాలు, నమ్మకాలు పండుగలు, జాతరలు, కళలు ఒక ప్రాంతానికే పరిమితం కాకుండ, అనేక ప్రాంతాలకు వ్యాపిస్తున్నాయి

**ఆచారం:** మానవుని ఆచార వ్యవహారాలలో ముఖ్యమైనవి జననం, వివాహం, మరణం అనేవి. గిరిజనులలో స్త్రీ బిడ్డకు జన్మనిచ్చినపుడు, 5వ రోజు లేదా 9వ రోజు ఆ గూడెంలోని ఇళ్ళ నుండి కడవలతో నీరు తెచ్చి తల్లీ బిడ్డలకు స్నానం చేయిస్తారు. దీనిని శుద్ధిస్నానం అంటారు. కొండదొరలలో శుద్ధి స్నానమైన తరువాత తల్లి ఏటికి వెళ్ళి తన బిడ్డ బట్టలుతుకుంది. ఆ తరువాత దోషాలు పోవడానికి ఒక చేతిగాజు ముక్కను, ఒకనల్లపూసను, తాటాకు ముక్కను నీటిలో విసిరి ఇంటికి తిరిగి వస్తుంది. ఈ మౌలికాచారమే గిరిజనుల్లో నీటిధార వదలడం, నూతిలో చేద వెయ్యడం అనే ఆచారంగా పాటిస్తున్నారు. సమాజంలోని సంప్రదాయ

కుటుంబాలవారు కూడా ముత్తైదువలను పిలిచి బాలింతతో నూతిలో చేదవేయడం లేదా చెరువుకి వెళ్ళి రేవుకు పసుపురాసి బొట్టులు పెట్టి పూజ చేసి బిందెతో నీటిని ఇంటికి తీసుకురావడం చేస్తారు. ఈ విధానాన్ని బహుప్రదేశ అస్థిత్వం కలదిగా చెప్పవచ్చు.

**వ్యవసాయం–వృత్తిపనులు :** గిరిజనులు పోడు వ్యవసాయం చేస్తారు. ఇటీవలి కాలంలో అటవీ సంరక్షణ శాఖవారు గిరిజనులను వారికి అధికారంలేని స్థలాల్లో పోడు వ్యవసాయం చేయడానికి అనుమతించడం లేదు. అందువల్ల గ్రామీణ మైదాన ప్రాంతాలలో నివసించే గిరిజనులు. నాగలితో భూమిని దున్ని వ్యవసాయం చేస్తున్నారు.

**పండుగలు:** కొన్ని పండుగలు కొన్ని కులాలకు మాత్రమే పరిమితమై ఉంటాయి. అనగా ఒక్కొక్క పండుగను, ఒక్కొక్క కులం వారు మాత్రమే జరుపుకుంటారు. కాలక్రమేణ అటువంటి పండుగలు గ్రామంలోని అన్ని కులాల వారు జరుపుకుంటున్నారు. ఉదాహరణకు తెలంగాణ ప్రాంతంలోని బతుకమ్మ పండుగ. ఈ పండుగను ఆ ప్రాంతంలోని కొన్ని కులాల వారు మాత్రమే జరుపుకునేవారు. దళితులు జరుపుకునేవారుకాదు. కాని నేటి సమాజంలో ప్రభుత్వం అన్ని సామాజిక వర్గాల వారు ఆ పండుగను జరుపుకోవాలని భావించి బతుకమ్మ పండుగను జాతీయ పండుగగా ప్రకటించింది. ప్రస్తుతం ఈ పండుగను ప్రపంచంలోని మారుమూల ప్రాంతాల ప్రజలందరికి తెలిసింది. ఒకరకంగా సాంఘిక సంస్కరణ జరిగినట్లుగా భావించవచ్చు. బతుకమ్మ ఆడేటప్పుడు వలయాకారంలో తిరుగుతూ చేతులు తడుతూ పాటలు పాడతారు. అదేవిధంగా ఆంధ్రప్రదేశ్‌లోని విశిష్టమైన పండుగ సంక్రాంతి. ఈపండుగలో ఇళ్ళముందు పెద్ద పెద్ద ముగ్గులు పెట్టి గొబ్బెమ్మలను పెట్టి, బాలికలు వలయాకారంగా తిరుగుతూ, చేతులు తడుతూ పాటలు పాడుతారు. తెలంగాణ రాష్ట్రంలోని బొడ్డెమ్మ, బతుకమ్మ పాటలకు ఆంధ్రరాష్ట్రంలోని గొబ్బెపాటలకు సాదృశ్యం కనిపిస్తుంది.

**బోనాలు:** తెలంగాణ రాష్ట్రంలో మైసమ్మ, పోచమ్మ, ఉజ్జయిని మహంకాళి మొదలైన దేవవతలకు కొత్తకుండలో అన్నం వండి, ఆ కుండకు పసుపు కుంకుమలతో బొట్టు పెట్టి దానిని వేపకొమ్మలు, బంతిపూలతో అలంకరిస్తారు. దానిపై మట్టి ప్రమిదనుఉంచి నూనె పోసి ఒత్తులు వేసి దీపం వెలిగించి అమ్మవారికి సమర్పిస్తారు. దీనిని బోనం అంటారు. ఆంధ్ర రాష్ట్రంలో నైవేద్యాలు అంటారు. రెండింటిలోను ఆచారాలు, నమ్మకాలు ఒకటే. ఇది బహుళోత్పత్తి వాదం కిందికి వస్తుందని చెప్పవచ్చు. ఈ వాదంలో వివిధ ప్రదేశాలలోని జానపద విషయాలలో పోలిక ఉంటుంది. పై విషయంలో బోనం, నైవేద్యం, అమ్మవారికి సమర్పించడం మొదలైన పోలికలు ఉన్నాయి.

**జాతరలు:** మేడారం జాతర సమ్మక్క, సారక్క జాతర మొదలైన వాటిని మొట్టమొదట గిరిజనులు మాత్రమే జరుపుకునేవారు. కాలక్రమేణ ప్రపంచంలోని నలుమూలల నుండి ప్రజలు వచ్చి ఈ జాతరలో పాల్గొంటున్నారు. తమ మొక్కులు తీర్చుకుంటున్నారు.

**నాగోబా జాతర:** ఈ జాతర కూడా గిరిజనులకు సంబంధించింది అయినప్పటికి అనేక ప్రాంతాల ప్రజలు వచ్చి నాగదేవతలను పూజిస్తారు. ఇది ఏకోత్పత్తి వాదం కిందికి వస్తుంది. ఈ జాతరలు ఒకప్రదేశంలో పుట్టి ఇతర ప్రదేశాలకు వ్యాపించాయి.

**భాష:** గిరిజన తెగలలో ప్రత్యేక భాష వాడుకలో ఉంది. కొన్ని తెగలవారు తెలుగు భాషలో మాట్లాడతారు. ఆ భాష ప్రాంతీయ మాండలిక పదాలలో కనిపిస్తుంది ఉదాహరణ :

అలేలు – వెదురు బద్దలు
ఊల – కోరిక
ఇంగలం – నిప్పు
ఇసింపండుగ – ఉగాదిపండుగ మొదలైనవి.

సామెతలు : 1. పిట్టను గొట్ట పొయ్యిల బెట్ట
2. సంతలో కొట్టినందుకు సాక్షులెవరు మొదలైనవి.

పొడుపు కథలు : 1. ఇసుకను మప్పినవాడెవడె – చెదపురుగు
2. మంచును కుంచాన పట్టిన వాడు – తేనెటీగ

**పలుకుబడులు**

1. ఇట్లు చేయడం, ఇంటివాడిని చేయడం, పెళ్ళికాగానే కొత్తగుడిసె వేసుకొని కొత్త ఇంట్లో కాపురం చేయడం చెంచుల పద్ధతి.
2. బొట్టుకు పోతున్నం –అంటే కన్య నిశ్చయానికి పోవడం
3. తెల్ల గుఱ్ఱం ఎక్కివచ్చిండు –కల్లు బాగా తాగివచ్చిండు
4. గాంధారివేళ – అర్ధరాత్రివేళ

*(తెలుగు జానపద విజ్ఞానం –సమాజం–సంస్కృతి– సాహిత్యం–39)*

పై భాషాంశాలన్ని మొదట్లో కొన్ని గిరిజన తెగలకు పరిమితమైనవి అయినప్పటికి కాలక్రమేణ అవి సమాజంలోని అన్ని వర్గాల వారు మాట్లాడే వాడుక భాషలోకి ప్రవేశించాయని చెప్పవచ్చు.

ఈవిధంగా శిష్ట సాహిత్యంలో సంస్కరణవాదాలు ఉన్నట్లుగానే జానపద సాహిత్యంలో కూడా ఏకోత్పత్తివాదం, బహుళోత్పత్తివాదం, మనో విశ్లేషణ సిద్ధాంతం మొదలైనవి ఉన్నట్లు పండితులు నిర్ణయించారు. వాటి ద్వారా జానపద సాహిత్యం వల్ల సమాజంలో అనేక మార్పులు సంభవిస్తున్నాయని చెప్పవచ్చు. జానపద కళల ద్వారా కూడా సమాజంలో వరకట్నం, మధ్యపాన నిషేధం మొదలైన అంశాలను ప్రచారం చేసి వాటిని రూపుమాపే ప్రయత్నం

చేయవచ్చు. ప్రజలలో దేశభక్తిని పెంచే గేయాలు, కథాగేయాలు కూడా ప్రచారంలో ఉన్నాయి. ఈ విధంగా జానపద సాహిత్యం ప్రజలను చైతన్యవంతులను చేస్తుందని చెప్పడంలో ఏ మాత్రం అతిశయోక్తిలేదు. జానపద సాహిత్యాన్ని నిశితంగా పరిశీలించినట్లైతే అనేక అంశాలు వెలుగులోకి వస్తాయి. ఈ దృష్టితో పరిశోధన చేయవచ్చు.

**ఉపయుక్త గ్రంథాలు**

1. కృష్ణకుమారి, నాయని. 2000. తెలుగు జానపద విజ్ఞానం సమాజం సంస్కృతి–సాహిత్యం. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు.
2. లీలావతి, పొన్న. 1986. అన్నమయ్య సంకీర్తనలలో జానపదగేయ పణితులు. పొన్నా పబ్లికేషన్స్, పానకం.
3. సుందరం, ఆర్.వి.యస్. 1996. ఆంధ్రు జానపద విజ్ఞానం. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు.



*(భావవీణ, డిసెంబరు, 2018 ప్రత్యేక సంచిక. (అంతర్జాతీయ సదస్సు)*
*ప్రధాన సంపాదకులు డా. కొండా రవి.*
*సర్.సి.ఆర్. రెడ్డి కళాశాల, ఏలూరు).*

## 2. దేశి, జానపద సాహిత్యాలు - సామ్య భేదాలు

తెలుగుతో దేశి జానపద రచనలలో విషయంలోనూ, రూపంలోను కొంత సమానత్వం, కొంత భేదం కనిపిస్తుంది. దేశి రచనలలో కూడ కొన్ని జానపద లక్షణాలను గుర్తించవచ్చు. ఈ దృష్టితో దేశి రచనలలోను, జానపద రచనలలోను ఉన్న వస్తు రూపాలను అధ్యయనం చేయవలసిన ఆవశ్యకత ఉంది.

**దేశి సాహిత్యం**

నన్నయ్యకు పూర్వం నుండి సంస్కృత ప్రభావం లేకుండా కొన్ని రచనలున్నట్లుగా సాహిత్య చరిత్ర ద్వారా మనకు తెలుస్తుంది. అలాగే శాసనాలలో కన్పించే తరువోజ, అక్కర, సీస గీతాలు, నన్నయ్యకు ముందున్న దేశీయచ్ఛందోరీతులుగా గుర్తింపబడ్డాయి.

తెలుగులో పామర ప్రజలు పాడుకునే కొన్ని పదాలుండేవని పాల్కురికి సోమనాథుడు పేర్కొన్నాడు.

**పదములు తుమ్మెద పదముల్ ప్రభాత**
**పదములు పర్వతపదములానంద**
**పదములు శంకర పదముల్, నివాళి**
**పదములు వాలేశు పదములు గొబ్బి**
**పదములు వెన్నెల పదములు సంజ**
**వర్ణన మణిగణ వర్ణన పదము**
**లర్ణవ ఘోషణ ఘూర్ణిల్లుచుండ**

*(పండితారాధ్య చరిత్ర : 513)*

పైన చెప్పిన పదములన్ని దేశిసాహిత్యంలో చేరతాయి. శతకం, శివతత్త్వసారము, దీపకళిక, మహానాటకం, ఉదాహరణ మొదలగు రచనలు ప్రజలు పాడుకుంటూఉండేవారు. ఇటువంటి రచనలన్ని సంస్కృత సాహిత్య ప్రభావం లేకుండ తెలుగు దేశానికి మాత్రమే సంబంధించిన వస్తువుతోను, ఛందోరీతులతోను ప్రత్యేకశాఖగా సాహిత్య చరిత్రలో గుర్తింప బడ్డాయి. దీనినే దేశికవిత అని సాహిత్య చరిత్రకారులు పేర్కొన్నారు.

పాల్కురికి సోమనాథుడు మత సిద్ధాంతాలను సామాన్యుల వద్దకు తీసుకువెళ్ళడం కోసం ద్విపద రగడ పద్యాలలో రచనలు చేశాడు. కళిక, ఉదాహరణ, ముక్తకం, శతకం మొదలయిన రచనా భేదాలు ప్రచారంలోకి తెచ్చాడు. దక్షిణాంధ్రయుగంలో యక్షగాన పదసాహిత్యం ఎక్కువగా రచింపబడింది. అన్నమయ్య, క్షేత్రయ్య, త్యాగయ్య మొదలయిన వాగ్గేయకారులు అపారమైన పదసాహిత్యాన్ని సృష్టించారు. ఈవిధంగా ఉన్న సాహిత్యానికి వస్తుపరంగాను, ఛందస్సు పరంగాను నన్నయ్య, తిక్కన, పెద్దన మొదలయినవారి మార్గ సాహిత్యం కంటె భిన్నత్వం కనిపిస్తుంది.

## జానపద సాహిత్యం

సమాజంలో మౌఖిక ప్రచారంలో ఉన్న సాహిత్యాన్ని జానపద సాహిత్యంగా పరిగణించారు. విద్యకు విజ్ఞానానికి దూరంగా ఆచారాలు, నమ్మకాలతో కూడిన స్థానికమైన జీవన విధానాన్ని గడిపేవారు జానపదులు. వీరి మౌఖిక సాహిత్యంలో ఎక్కువగా గేయాలుంటాయి. జానపద గేయ రీతుల నుండే ద్విపద సీసం వంటి పద్యరీతులు మార్గ సాహిత్యంలోకి ప్రవేశించినట్లుగా సాహిత్య చరిత్ర వల్ల తెలుస్తుంది. నన్నయ్య కాలం నుంచి ప్రసిద్ధిలో ఉన్న మార్గ సాహిత్యానికి సమాంతరంగా దేశి సాహిత్యం ఉన్నట్లుగానే దానికంటే ప్రత్యేకంగా సామాన్య ప్రజలలో జానపద సాహిత్యం కూడా ఉందని చెప్పవచ్చు. మార్గదేశి సాహిత్యాలలో ఉండే లక్షణ నిర్దుష్టత లేకపోవడం జానపద సాహిత్యం ప్రత్యేక లక్షణం. ఇటువంటి జానపద గేయ రచనలలో కాటమరాజు కథలు, బొబ్బిలియుద్ధం, పల్నాటివీర చరిత్ర, బుడ్డా వెంగళ రెడ్డి చరిత్ర, స్త్రీల రామాయణపు పాటలు, మంగళహారతులు మొదలైనవి ప్రసిద్ధమైనవి.

## వస్తుపరామర్శ

దేశి రచనలలో ఎక్కువగా యక్షగానాలు, ద్విపదలు, పదాలు, పాటలు వంటివి ఉంటాయి. వీటిలో ఎక్కువగా, భక్తి, శృంగారం, తత్త్వం, ప్రబోధం వంటివి వస్తువుగా ఉంటాయి. యక్షగానాలలో స్తోత్ర లక్షణాల తోపాటు సామాజిక, చారిత్రక లక్షణాలు కూడా ఉంటాయి. పద సాహిత్యంలో తత్త్వికాంశాలు, భక్తి ఎక్కువగా ఉంటాయి. జానపద సాహిత్య రచన లయిన కాటమరాజుకథలు, స్త్రీల పాటలు, పల్నాటి వీరచరిత్ర వంటి వాటిలో చారిత్రక సామాజి కాంశాలు, జానపదులు జీవనవిధానం, మతం మొదలగునవి ఉంటాయి. ఈ విధంగా దేశి, జానపద రచనలలో కనిపిస్తున్నటువంటి వస్తువులో కొంత సమానత్వం, కొంత భేదం కనిపిస్తుంది. ఇతివృత్తం, రచనా విధానంలో కూడా కొంత సమానత్వం, కొంత భేదం కనిపిస్తుంది.

## రూప పరామర్శ

దేశి జానపద రచనలలో రూపం అంటే నిర్మాణ పద్ధతులు ప్రత్యేకంగా గుర్తింపదగినవి. దేశి విభాగానికి చెందిన రచనలు అక్షరగణ మాత్రాగణ బద్ధమైనవి. యక్షగానం, ద్విపద,

రగడలు, పదాలు మొదలయిన రచనలన్ని మాత్రాగణాలతోను సూర్య ఇంద్రగణాలతోను రచింపబడతాయి. సూర్య ఇంద్రగణాలు దేశి సాహిత్యానికి చెందిన ప్రత్యేక లక్షణం. పద సాహిత్యం, మౌఖిక సంప్రదాయానికి చెందిన నిర్ధుష్టమైన సంగీత లక్షణాలను కలిగి ఉంటుంది. ఇక జానపద సాహిత్యానికి చెందిన గేయాలు ఎక్కువగా మాత్రాగణబద్ధమై ఉంటాయి. జానపద సాహిత్యానికి ప్రత్యేకమైన పునరావృత్తులు, సుదీర్ఘమైన రచన, గణాన్ని రాగంతో నింపడం వంటి లక్షణాలు ఈ గేయాల్లో ఉంటాయి. ఈ విధంగా దేశి జానపద రచనల రూపంలో భేదం, సామ్యం కనిపిస్తాయి.

## సామ్య భేదాలు

జానపద సాహిత్యం సామూహిక రచన కాబట్టి ప్రత్యేకంగా కవి ఉండదు.

దేశి సాహిత్యానికి కవి ఉంటాడు

జానపద గేయాలు మాత్రాగణ బద్ధంగా ఉంటాయి.

దేశి రచనలలో మాత్రాగణాలు–అక్షరగణాలు ఉంటాయి.

జానపదగేయాలలో మధ్యాక్కర, రగడ, ద్విపద లక్షణాలు కనబడతాయి.

దేశి రచనలలో మధ్యాక్కర రగడ ద్విపద ఛ్ఛందస్సులు ఉంటాయి.

జానపద సాహిత్యం మౌఖికంగా ఉంటుంది.

దేశి రచనలు లిఖిత పూర్వకంగా ఉంటాయి.

జానపద సాహిత్యంలో అక్కడక్కడ మార్గసాహిత్య ప్రభావం కనిపిస్తుంది.

దేశి సాహిత్యం మార్గ జానపదాల మిశ్రరూపం

దేశి సాహిత్యంగా చెప్పబడే ఉదాహరణ కావ్యంలో మాత్రాగణ పద్యాల తోపాటు వృత్త పద్యాలు కూడా ఉంటాయి.

జానపద కథా గేయాలుగా చెప్పబడే కాటమ రాజు కథలు, బొబ్బిలి యుద్ధం, ద్విపద ఛ్ఛందస్సుతో ఉంటాయి. వీటిని రూపపరంగా దేశిగా చెప్పవచ్చు. కారణం ద్విపదలో రచింపబడడం. బుడ్డా వెంగళ రెడ్డి చరిత్రలోని వస్తువు సామాజికపరమైనది.

దేశిలో పురాణ గాథలు ఉంటాయి. జానపదంలో పురాణ విషయా లున్నప్పటికి వాటికి జానపదులు తమ అనుభవాలు జోడిస్తారు. స్త్రీల రామాయణపు పాటలు వంటివి దీనికి ఉదాహరణలు. ఈ గేయాలు ద్విపదలో ఉంటాయి. వీటిలో పురాణ సంబంధ విషయాలు చెప్పబడ్డాయి. కాబట్టి వీటిని దేశిరచనలుగా చెప్పవచ్చు.

జానపద గేయాలలోని సంగీత లక్షణాలు సరిచేసి దేశిలో వాడుకొంటారు. అన్నమయ్య పదరచనలు జానపద గేయాలను ఆధారం చేసుకొన్నవే అని చెప్పవచ్చు. మేలుకొలుపు

పాటలు, గొబ్బిపాటలు తుమ్మెద పదాలు, చిలుక పదాలు, హంస పదాలు, శోభనపు పాటలు, జాజర పాటలు మొదలగునవి ఈ కోవకు చెందిన రచనలు

దేశి సాహిత్యంలో కొంత ప్రౌఢత కనిపిస్తుంది. జానపదంలో ప్రౌడత ఉండదు. దీనికి కారణం పాఠకులు, శ్రోతలు సామాన్యులై ఉండటం. జానపద గేయాలు ఎక్కువగా కథారహితాలు. దేశి సాహిత్యంగా పరిగణింపబడే యక్షగానాలు. బుర్రకథలు, హరికథలు, స్త్రీల వ్రతపు పాటలు, నోముల పాటలు కథా సహితాలు. ఈ విధంగా దేశి సాహిత్యంలోను, జానపద సాహిత్యంలోను వస్తువులోను, రూపం లోను అనేక సామ్య భేదాలను అధ్యయనం ద్వారా గుర్తించవచ్చు.

## జానపద గేయాలలో సంగీతం

శాస్త్రీయ సంగీత పరంగా చూసినట్లైతే జానపద గేయాలలో శాస్త్రీయ సంగీత లక్షణా లున్నాయని చెప్పవచ్చు. దేశి సాహిత్యానికే కాకుండ దేశి సంగీతానికి కూడా జానపద గేయాలే ఆధారమని తెలుస్తుంది. జానపదులు అప్రయత్నంగా అలవోకగా తీసే కూనిరాగమే జానపద సంగీతానికి నాంది అయ్యింది. అటువంటి జానపద సంగీతమే నేటి శాస్త్రీయ సంగీతానికి మూలాధారమైందని భావించవచ్చు. శాస్త్రీయ సంగీతంలో ఉండే స్వరరాగ తాళాలు జానపద గేయాలలో కూడా కనబడతాయి. జానపద గేయాలను అధ్యయనం చేయడం ద్వారా వీటిని నిరూపించవచ్చు.

శంకరాభరణం, శ్రీరాగం, ఆనందభైరవి, భూపాలం యదుకుల కాంభోజి, సురటి, ముఖారి కేదారగౌళి మొదలగు రాగాలున్నట్లు ఆచార్య ఎస్.వి.జోగారావుగారు ఆంధ్రయక్షగాన చరిత్రలో పేర్కొన్నట్లు పొన్నాలీలావతి అన్నమయ్య సంకీర్తనలలో జానపద గేయ ఫణితులు అనే గ్రంథంలో తెలియజేశారు.

## జానపద గేయాలు తాళం

**తాళం:** శివుడు చేసే నృత్యాన్ని తాండవం అంటారని, పార్వతి చేసే నృత్యాన్ని లాస్యం అంటారని, తాండవంలోని 'తా' అనే అక్షరాన్ని లాస్యంలోని 'లా' అనే అక్షరాన్ని తీసుకొని తాలం అని పలికే వారని క్రమంగా అది 'తాళం'గా మారిందని తెలుస్తోంది.

*(అనురాధ, పంగులూరి. 2003)*

తాళానికి అంగాలు చాల ఉన్నప్పటికి మూడు రకాల అంగాలు వాడుకలో ఉన్నాయి.

| అంగం పేరు | గుర్తులు |
|---|---|
| 1. లఘువు | I |
| 2. ధృతం | 0 |
| 3. అనుధృతం | U |

శాస్త్రీయ సంగీతంలో తాళగతులు 5 రకాలుగా ఉన్నాయి.

1. త్రిశ్రగతి – 3 మాత్రల కాలం
2. చతురశ్రగతి – 4 మాత్రల కాలం
3. ఖండగతి – 5 మాత్రల కాలం
4. మిశ్రగతి – 7 మాత్రల కాలం
5. సంకీర్ణగతి – 9 మాత్రల కాలం

జానపద గేయాలలోని చరణాలు ఆవృత్తాలతో కూర్చబడి ఉంటాయి. గేయంలోని ఆవృత్తాలు, మాత్రాకాలంలో చెప్పబడ్డాయి. పద్యాలు పాడాలంటే గురు, లఘువుల క్రమం నిర్ణీత కాలం పాటించాలి. గేయాలు పాడేటప్పుడు కాలప్రమాణం పాటించాలి.

జానపద గేయాలలో చరణాలలోని ఆవృత్తాలలోని మాత్రలకు త–క–కి–ట అనే అక్షరాలను చిహ్నాలుగా ఏర్పరిచారు. ఇవి ఒక్కొక్క మాత్రాకాలాన్ని సూచిస్తాయి. వీటిని సంగీతాక్షరా లంటారు. ఇవి సాహిత్యాక్షరాలతో సమానంగా ఉండాల్సిన నియమం లేదు. ఒక్కొక్కసారి ఒకటి రెండు సాహిత్యాక్షరాలు తక్కువయినా, లేక లోపించినా అక్షరాలను సాగదీసి పాడవచ్చు. అలాగే ఒకటి రెండు సాహిత్యాక్షరాలు సంగీతాక్షరాల కంటే ఎక్కువైనా వాటిని మాత్రాకాలానికి సరిపోయే విధంగా కుదించి పాడవచ్చు.

*(అనురాధ, పంగులూరి. 2003)*

**1. త్రిశ్రగతి :** మూడు మాత్రల ఆవృతము కలిగి ఉంటుంది. తకిట! తకిట! తకిట

ఉదా : "బండెనగ బండి గట్టే
పదహారు బళ్ళు గట్టే" అనే గేయంలో త్రిశ్రగతి ఉన్నట్లు గుర్తించారు.

*(అనసూయాదేవి, అవసరాల. –2010 : 42)*

**2. చతురశ్రగతి :** నాలుగు మాత్రల కాలప్రమాణం కలిగి ఉంటుంది. కిటతక! కిటతక! కిటతక! కిటతక

ఉదా : ఆడితొా ఉండలేక
ఆగమ్మ కాకిలాగ

**3. ఖండగతి :** ఐదు మాత్రల కాలప్రమాణం కలది. కిటతకిట! కిటతకిట! కిటతకిట! తకిటతక

ఉదా : ఆడవోళ్ళుండేటి సోటులో నీకూ
మాటలేముంటాయి కృష్ణుడా!

**4. మిశ్రగతి :** ఏడు మాత్రల కాలప్రమాణం కలిగి ఉంటుంది. తకిటకిటతక (లేదా) కిటతక తకిట

ఉదా : కోటిరత్నమూ ముద్దూ
కోమలాం...గీ...తన
కూటమునకు రమ్మన్నాదీ....

**5. సంకీర్ణగతి :** తొమ్మిది మాత్రల కాలప్రమాణం కలిగి ఉంటుంది. తకిటకిట తకిట! తకిటకిట తకిట"

ఉదా : నలుగురారా శ్రీనందకుమార
నలుగురిలోనా ఉండు రామయ్య

*(అనసూయాదేవి, అవసరాల. 2010)*

జానపద గేయాలలో చివరి ఆవృతం. ఒకలఘువునో గురువునో కోల్పోయి ఉంటుంది. అందుచేత చివరి ఆవృత్తాలలో అక్షరాలు తగ్గడమో, లోపించడమో కూడా జరుగుతుంది.

## జానపద గేయాలు - లయ

లయను ఆంగ్లంలో రిథిమ్ అంటారు. జానపదగేయాలు లయాత్మకంగా సాగుతాయి. జానపదగేయాలకు లయే ప్రాణం. పనిలో వేగం పెరిగినప్పుడు పాటలో వేగం పెరుగుతుంది. శాస్త్రీయ సంగీత విద్వాంసుడు సృష్టించుకున్న కట్టుబాట్లు వివిధ తాళాలు ఎంత గొప్ప సంగీత విద్వాంసుడికైనా ఒక్కొక్క సారి తాళం తప్పవచ్చుకాని జానపదులు ఎట్టి పరిస్థితులలోను లయ తప్పరు. తాళ ప్రధానమైన లయ రెండు విధాలు. 1. సమం 2. అసమం. అసమం మరల రెండుగా విభజింపబడింది. (1) అతీత (2) అనాగత

**1. సమం :** గేయంలో సాహిత్యం, లయ ఒకేసారి ప్రారంభమవుతాయి.

ఉదా : రామాలాలీ! మేగశ్యామ లాలీరామ"
తామారసనయన దశరథ! తలయాలాలీ రామ"

చెక్క భజనలో ఈ గేయాన్ని పాడుతారు.

**2. అసమం :** గేయంలో సాహిత్యానికి ముందుగానే లయ మొదలవుతుంది. గరగలు నృత్యం చేస్తూ పాడే గేయాలలో ఈ అసమం లయ కనిపిస్తుంది.

ఉదా : కరుణించే తల్లికి ! కోటి దండాలు
ఈ దుర్గమ్మ తల్లికి శతకోటి దండాలు

**2.1. అతీత :** ఈ గేయాలలో సాహిత్యం ముందుగానే ప్రారంభమై పాటకు అనుగుణంగా సాగుతుంది. గొరవయ్యల గేయాలలో ఈ అతీతలయ కనబడుతుంది.

ఉదా : శివా....కొండకు ననుపోదమురారమ్మా
మల్లయ్య కొండకు స్వామి! నను చూతము రారమ్మా!

**2. 2. అనాగత :** ఇందులో అసమలయలో లయ ప్రారంభమైన తరువాత సాహిత్యం ప్రారంభ మవుతుంది.

ఉదా : శ్రీ లక్ష్మి నీమహిమలు.... గౌరమ్మ చిత్రమైతోచునమ్మా

*(నరసయ్య, సంగనభట్ల. 2009 : 516)*

తాళం వేసేటప్పుడు రెండు క్రియల మధ్యకాలాన్ని లయ అంటారు. తాళం వేసేటప్పుడు రెండు క్రియల మధ్య కాలం సరిగా పాటించకపోతే లయ తప్పిందంటారు. ఈ లయ రెండు విధాలు (1) విలంబలయ (2) దురితలయ

1. **విలంబలయ :** విలంబనం అంటే నెమ్మది,చౌకం అని అర్థం. గేయాన్ని నెమ్మదిగా పాడే విధానాన్ని విలంబలయ అంటారు. ఈ విధానంలో ఒక అక్షర కాలాన్ని రెండు అక్షరాల కాలంలో పాడుతారు. జానపద గేయాలలో పాటను విలంబంతో మొదలు పెట్టి తరువాత ఆ పాటను రెట్టింపు కాలపరిమితితో కూడా పాడతారు.

2. **దురితలయ :** దురితం అంటే చురుకుగా పాడటం దురిత లయలో 2 అక్షరాలను, 4 అక్షరాల పరిమితితో పాడటం. కొన్ని జానపద గేయాలు ఎక్కువగా దురితలయలో పాడతారు. కొన్ని ప్రత్యేక సందర్భాలలో మాత్రం గేయం, ముందు విలంబలయలో తరువాత దురితలయలో కొంత మేరకు పాడాక, మళ్ళీ విలంబలయలో పూర్తి చేస్తారు.

*(అనురాధ, వంగులూరి. 2008)*

ఈ విధంగా శాస్త్రీయ సంగీతంలోనూ జానపద సంగీతంలోను అనేక సామ్యభేదా లున్నట్లు తెలుస్తుంది. జానపద గేయాలలో శాస్త్రీయ సంగీత లక్షణాలను పరిశోధకులు గుర్తించారు. జానపద గేయాలు సందర్భాన్ని బట్టి మారిపోతుంటాయి. వీరు ఒక పాటను అనేక విధాలుగా పాడుతారు. కాబట్టి శాస్త్రీయ సంగీతంలో లాగా ఒక గేయంలో ఒక రాగమే ఉంటుందని చెప్పలేము. ఈ దృష్టితో ఇంకా అధ్యయనం చేయవలసిన అవసరం ఉంది.

**ఉపయుక్త గ్రంథాలు**

1. అనసూయాదేవి, అవసరాల. 2010. జానపద గేయాలు, పొట్టి శ్రీరాములు, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు.
2. అనురాధ, పంగులూరి. 2008. జానపద సామూహిక నృత్యగేయాలు, శాస్త్రీయ గాన ధోరణులు. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

3. ఆరుద్ర. 2002. సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర. తెలుగు అకాడమి, హైదరాబాదు.

4. కృష్ణకుమారి, నాయని. 2007. తెలుగు జానపద గేయ గాథలు. తెలుగు అకాడమి, హైదరాబాదు.

5. జోగారావు, యస్.వి. 1961. ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్ర. ఆంధ్ర విశ్వకళాపరిషత్ ప్రకాశికము.

6. నరసయ్య, సంగనభట్ల. 2009. తెలుగులో దేశి ఛందస్సు ప్రారంభవికాస దశలు. ఆనంద వర్ధన ప్రచురణలు, ధర్మపురి, కరీంనగర్ జిల్లా.

7. లీలావతి, పొన్నా. 1986. అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయ పణితులు. పొన్నా పబ్లికేషన్స్, పానకం.

8. నాగయ్య. జి. 2009. తెలుగు సాహిత్య సమీక్ష. నవ్యపరిశోధక ప్రచురణలు, తిరుపతి.

9. శ్రీరామరాజు, డా. నడుపల్లి. 1985. తెలుగులో చందో విశేషములు, శ్రీ సత్యప్రచురణలు హైదరాబాదు.

10. సోమనాథుడు, పాల్కురికి (12శ) 1990. పండితారాధ్యచరిత్ర. తెలుగు విశ్వ విద్యాలయం, హైదరాబాదు.



(జానపద సరస్వతి–2013, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం సంపాదకులు – ఆచార్య పగడాల చంద్రశేఖర్, ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్యపరిషత్తు, హైదరాబాదు).

*(కేంద్రీయ విశ్వవిద్యాలయం హైదరాబాదు*
*తెలుగు విభాగం దేశి సాహిత్యం–వివిధ పార్శ్వాలు జాతీయ సదస్సు,*
*సెప్టెంబరు, 2011).*

# 3. జానపద సాహిత్యం - హాస్యం

జానపద సాహిత్యం మార్గ సాహిత్యం కంటే ప్రాచీనమైనది. మార్గ సాహిత్యం ముందుగా గ్రంథస్తం కావడం వల్ల ప్రాచీనమైనదిగా ప్రచారం పొందింది. జానపద సాహిత్యం మౌఖికంగా ప్రచారం పొందుతున్న సాహిత్యం. లక్షణ నియతానియతత్త్వం కలది. ఆలస్యంగా గ్రంథ రూపంలోకి వచ్చింది. జనపదాలలో నివసించేవారు జానపదులు. వీరు పాడుకొను పాటలే జానపద గేయాలు. వీటిని ఆంగ్లంలో Folk Songs అంటారు. Folk Songs అనుపదం Volk Slied అను జర్మను భాషాపదానికి అనువాద రూపం. ఉత్తర భారతదేశం వారు లోకసాహిత్య, లోకగీత్ అనే శబ్దాలను వాడుతున్నారు.

"కృతయజ్ఞశ్చ మేధావీ బుధో జానపద శ్శుచిః" అని వ్యాసుల వారు జానపదులను యజ్ఞము చేసిన వారితోను, పండితులతోను, సమానులని చెప్పారు. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు ఈ వాఙ్మయాన్ని ప్రజావాఙ్మయమన్నారు. శ్రీతల్లావజ్ఝల శివశంకరశాస్త్రి, శ్రీ అడిదము రామారావు ప్రభృతులు పదవాఙ్మయమని పేర్కొన్నారు. శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు అనాదృత వాఙ్మయమన్నారు. శ్రీవావిలాల సోమయాజులుగారు గేయ రచనలన్నారు. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు మధురకవితని పిలిచారు. శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు దేశిసారస్వత మన్నారు. శ్రీపంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ, శ్రీ టేకుమళ్ళ కామేశ్వరరావు శ్రీ హరి ఆదిశేషువు, శ్రీ తూమాటి దోణప్ప, శ్రీ నేదునూరి గంగాధరం మొదలైనవారు జానపద శబ్దాన్నే వాడారు. ఆచార్య బి. రామరాజుగారు, జానపదగేయానికి పదిలక్షణాలను చెప్పారు. అవి మౌఖిక ప్రసరణ, అజ్ఞాత కృర్తృత్వం, అవిదిత కాలనిర్ణయం, గాన యోగ్యం. విభిన్న పాఠాంతర సమన్వితం, ఆశు రచన, శైలీ నిరాడంబరత, పునరావృతం, భావనిర్భరం రసఘుళిక అనేవి.

*(రామరాజు, బి. 1990 :1)*

తెలుగు జానపద సాహిత్యాన్ని పలువురు పండితులు పలురకాలుగా వర్గీకరించారు. ఆమె జానపద వాఙ్మయాన్ని గేయశాఖ, వచనశాఖ, దృశ్యశాఖ అని విభజించారు. గేయశాఖను కథారహితము, కథాసహితము అని విభజించారు. శ్రామిక గేయాలలో కొన్ని కథా రహితాలు,

కథాసహితాలు ఉన్నాయి. కథా రహిత శాఖలోని శ్రామిక గేయాల్ని శృంగార ప్రధానములు హాస్య ప్రధానములు, కరుణ ప్రధానములని విభజించారు. వచనశాఖను కథారహితం, కథాసహితమని విభజించి పొడుపు కథలు, సామెతల్ని కథారహితంలోను, నీతికథలు, వీరకథలు, అద్భుతకథలు, పురాణకథలు, పురాకల్పిత కథలు, పేదరాశిపెద్దమ్మ కథలను కథాసహితంలోను చేర్చారు. దృశ్యశాఖను మనుష్యులు ఆడించే ప్రక్రియ, మనుష్యులు ఆడే పక్రియ అని విభజించి పగటి వేషాలు, వీధినాటకం, యక్షగానాల్ని మనుషులు ఆడే ప్రక్రియలో చేర్చారు. తోలుబొమ్మలాట, చెక్కబొమ్మలాటను మనుష్యులు ఆడించే ప్రక్రియలో చేర్చారు.

*(కృష్ణకుమారి, నాయని. 2007:19)*

ఆచార్య నాయని కృష్ణకుమారిగారి కథా విరహిత శాఖ కింద హాస్యపు గేయాలు చేర్చబడ్డాయి. హాస్యగేయాలలో హాస్యానికి ప్రత్యేక స్థానం ఉంటుంది. జానపదులు హాస్య గేయాలను పాడుకుంటూ తమ శ్రమను మరచిపోతారు. జానపద సాహిత్యంలో స్త్రీ వైశిష్ట్యం ఎక్కువగా కనబడుతుంది. ముసలివాడు వయస్సులో ఉన్న స్త్రీని వివాహం చేసుకొని పడే ఇబ్బందులు, బావ మరదళ్ళ మధ్య హాస్యం గేయాలలో వర్ణింపబడింది. పెళ్ళికొడుకుని పేరంటాళ్ళు హాస్యమాడడం ఒక గేయంలోను, గౌరినోము నోచుకునే సమయంలో వయసులో ఉన్న పడుచులు యువకులను హేళన చేయడం ఒక గేయంలోను వియ్యాలవారు పెళ్ళి సమయంలో హాస్యాలాడుకోవడం ఒక గేయంలోను ఉంది. గడసరి భార్య, భర్తను ఏవిధంగా ఇబ్బంది పెడుతుందో ఒక గేయంలో ఉంది. ఒక సోమరిపోతు రైతు, ప్రియురాలు ప్రియుడు సంభాషణలు, వివాహ సమయంలో జరిగే హాస్యపు సంభాషణలు మొదలగు అంశాలకు సంబంధించిన గేయాలు కూడా ఉన్నాయి.

## 1. వార్ధక్యంలో ఉన్న పురుషుడు–హాస్యం

వార్ధక్యంలో ఉన్న పురుషుడు యుక్తవయస్సులో ఉన్న స్త్రీని వివాహం చేసుకొని ఏవిధమైన అవస్థలు పడుతున్నాడో ఈ కింది గేయంలో తెలుస్తుంది.

ముసలాడు మాతాత వసి నిమ్మపండు
పడుచు దానిని పెండ్లాడి పైకాపులుండె
నవ్వుతూ ఆయమ్మ నంది పూజించి
ఆ నంది పూజలకు నీళ్ళులేవనెను
తవ్వించి మాతాత తోవల్ల చెరువు
తోవల్ల చెరువుకు తోడు లేదనెను
వేయించె మాతాత వేళ్ళతో మర్రి
వేళ్ళతో మఱ్ఱికి ఎరువు లేదనుచు

గడ్డపారలు బట్టి గంగ నీరెట్టె
చెరువు ప్రక్కని నిమ్మతోట వేశాడు
ఆతోవ వెళ్ళేరు పేదబాపళ్ళు
ఆ నీరు త్రాగేరు నీడలట్టేరు
ఆపళ్ళు తిన్నారు పాట పాడేరు
కూడు తిన్నట్టుగా పళ్ళు తిన్నారు
......................................."

*(త్రివేణి : 221)*

ఇక్కడ ముసలి భర్త భార్యకు కాపలా ఉంటాడు. ఆమె పూజకోసం చెరువు తవ్విస్తాడు. మర్రిచెట్టు నాటి, నిమ్మతోట వేస్తాడు. అవన్నీ ఆదారిన పోయేవారు ఉపయోగించుకుంటారు. సమాజంలో వయసు మళ్ళిన పురుషులు యుక్త వయస్సులో ఉన్న స్త్రీని వివాహం చేసుకోడం ఉంది. అటువంటి పురుషుడు ఎదుర్కొనే ఇబ్బందులు పై గేయంలో వ్యక్తమవుతున్నాయి. యుక్త వయస్సులో ఉన్న స్త్రీని చూడడానికి పురుషులు వస్తున్నారనే అంతర్గత భావన కూడ ఈ గేయం ద్వారా వెల్లడి అవుతుంది. ఈవిధంగా జానపదులు హాస్య సన్నివేశాలను సృష్టించుకొని గేయాలను పాడుకుంటారు.

## 1.1 వృద్ధుని భార్య – హాస్యం

ముసలి భర్తతో కాపురం చేసే స్త్రీ మనోవేదన ఈ క్రింది గేయంలో వ్యక్తమవుతుంది.

ముసలోడు మొగడైన మూతిపుండైన
పొత్తునా తినుమంచు నిత్తెపోరాడు
పన్నెండు ఏండ్లది పాతదూలమ్మ
పడెనమ్మా ముసలోని పండ్లల్లా నడుమ
పండ్లన్నీ పిండాయె నోరెర్రానాయె
ఇగచూడు ముసలయ్య ఇల్లెల్ల వెలుగు
నారొండి తాళమ్మ నీరొండికొచ్చే
.......................................

*(త్రివేణి : 257)*

పై గేయంలో ముసలివాడైన భర్తను వివాహం చేసుకున్న స్త్రీ గురించి పాడుకుంటారు. ఇక్కడ హాస్యం తోపాటు ఒక స్త్రీ జీవన విధానం వ్యక్తమవుతుంది.

## 2. సమాజంలోని వ్యక్తులు – హాస్యం

సమాజంలో వ్యక్తులు ఒకరిని మించినవారు ఒకరుంటారు. జానపదులు ఆ వ్యక్తుల గురించి హాస్యాస్పదంగా ఈక్రింది విధంగా పాడుకుంటున్నారు.

నాచుల యుండే మీసము దువ్వే రొయ్యి పీతగారూ
రొయ్యి పీతకే మొనగాడండీ మట్టగిడసగారూ!
మట్టగిడసకే మొనగాడండీ ఎంద్రకాయగారూ
ఎంద్రకాయకే మొనగాడండీ నక్కపోతుగారూ
నక్కపోతుకీ మొనగాడండీ కుక్కపోతుగారూ
కుక్కపోతుకీ మొనగాడండీ దుడ్డుకర్రగారూ
దుడ్డుకర్రకీ మొనగాడండీ! కత్తులకామయ్యా
కత్తుకామయ్యకు మొనగాడండీ బొగ్గులసూరయ్యా
..................................................

*(త్రివేణి : 223)*

పైది ముక్తపద గ్రస్తంలో ఉన్న హాస్య గేయం. జానపదులు హాస్య సన్నివేశాలను సృష్టించుకొని పాటలను పాడుతుంటారు. జానపద స్త్రీలు తలచుకుంటే పురుషుణ్ణి ఏ విధంగా గేలిచేస్తారో ఇక్కడ వ్యక్తమవుతుంది. అటువంటి సన్నివేశాలు కల్మషం లేని వారి మనోభావాల నుండి వెలువడతాయి. అవి వారి జీవితంలో ఒక భాగం.

### 3. బావా మరదళ్ళు – హాస్యం

బావ మరదళ్ళ చమత్కార సంభాషణ ఈ క్రింది గేయంలో ఉంది.

నవ్వులా నారాసి అత్తకొడుకూ వచ్చి
నువ్వులు నూర్చాలని నూరెడ్ల నడుగు
పాలు త్రాగి మా యెడ్లు పత్తి నూర్చా వెళ్లె
పదిపుట్ల ధాన్యమూ నూర్చేము గాని
పత్తిచే నెన్నడూ నూర్చి నే నెరుగ
నూరుపుట్ల ధాన్యమూ నూర్చేము గాని
నూవ్వు చేనెన్నడూ నూర్చి నేనెరుగ
అత్త కూతురు వని అడిగితిని గాని
అతి జాణవేయౌట నిన్ను నేనెరుగ
మామకొడుకు వని మన్నించితిని గాని
మాటకారుడ వౌట నిన్ను నే నెరుగ

*(త్రివేణి : 224)*

వ్యవసాయం ఏవిధంగా చేయాలో తెలియని తన బావని మరదలు హాస్యమాడుతుంది. సహజంగా ధాన్యం నూర్చే సమయంలోనే ఎద్దులను ఉపయోగిస్తారు. కాని పై గేయంలో నువ్వులు నూర్చడానికి, పత్తిని నూర్చడానికి ఎడ్లను ఇవ్వమని అడగడానికి మరదలి ఇంటికి

బావ వెళతాడు. పత్తిని నూర్చడ మనేది హాస్యాస్పదమైన అంశం. ఇక్కడ బావ ఏదో ఒక వంకతో మరదలితో మాట్లాడడానికి వెళుతుంటాడు. ఆ విషయం గమనించిన మరదలు తనబావను ఆటపట్టిస్తుంది.

గ్రామాలలో స్త్రీలు కూడా వ్యవసాయపు పనుల మీద అవగాహన కలిగి ఉంటారు. పై గేయంలో హాస్యమే కాకుండా, వ్యవసాయపు పనులను గురించి కూడా తెలుస్తుంది. వారి జీవితం వ్యవసాయపు పనులతో ముడిపడి ఉంది. ఇక్కడ స్త్రీకి వ్యవసాయం పట్ల గల అవగాహనతోపాటు పురుషుడికి గల అవగాహన రాహిత్యం కూడా వెల్లడి అవుతుంది.

## 4. వరుడుతో పేరంటాళ్ళు–హాస్యం

కొత్త పెళ్ళికొడుకుతో పేరంటాళ్ళు హాస్యమాడడం ఈక్రింది గేయం వల్ల మనకు తెలుస్తుంది.

నిన్న తిన్న విస్తళ్ళు నెట్టులడ్డాయి
నీతి మాలిన పెండ్లికొడక లేచిరావయ్య
మొన్న దిన్న విస్తళ్ళు మోపులడ్డాయి
మొండి పెళ్ళి కొడక లేచిరావయ్య
ఏనుగులు లేవని యే లడిగినారు
యెల్లగాడిద లెక్కి లేచిరావయ్య
గుఱ్రాలు లేవని ఏ లడిగినారు
గుడ్డికుక్క లెక్కి లేచిరావయ్యా
పల్లకీలు లేవని ఏలడిగినారు
పందికొక్కూ నెక్కి లేచిరావయ్యా

*(త్రివేణి : 225)*

వివాహసమయంలో మగపెళ్ళివారు ఆడపెళ్ళివారిని అనేక వసతులు ఏర్పాటు చేయమని కోరుతుంటారు. వారు కోరిన కోర్కెలను ప్రస్తావిస్తూ ఆడపెళ్ళివారు వ్యంగ్యంగా పెళ్ళికొడుకుని ఉద్దేశించి పాడిన గేయ మిది. సమాజంలో వివాహ వ్యవస్థ ఏవిధంగా ఉందో పై గేయం వల్ల తెలుస్తుంది. మగపెళ్ళి వారు వివాహం చేసుకోడానికి ఆడపెళ్ళివారి ఇంటికి వస్తారు. వారు అలా రావడానికి ఏనుగులు, గుఱ్రాలు, పల్లకీలు మొదలగునవి అడుగుతారు. ఏనుగుకి బదులు, వెల్లగాడిదలను, గుఱ్రాలకు బదులు గుడ్డి కుక్కలను, పల్లకీలకు బదులు పందికొక్కులను ఎక్కిరమ్మని పేరంటాళ్ళు పాడతారు. ఈ గేయం హాస్యం తోపాటు, సమాజంలో గల ఇటువంటి పురుషులకు కనువిప్పు కలిగే విధంగా కూడా ఉంది.

## 4.1 మగపెళ్ళివారు, ఆడపెళ్ళివారు – హాస్యం

పెళ్ళి సమయంలో వరుడు తరఫువారు వధువు తరఫువారిని హాస్యమాడడం, నిష్ఠూరపు మాటలు, ఎత్తిపొడుపులు మాటలాడడం ఈ క్రింది గేయంలో కనిపిస్తుంది.

పెదబోడి చినబోడి పెండ్లిండ్లు ఆడ
బోడి పెండిండ్లకే మూడు తవలొడ్లు
కోడికోడి దంచితే కొణితేడే ఆయె
చెరిగి చెరిగి దంచితే చేరెడే ఆయె
కుండ్లు నట్లూ గడిగి కుదురొప్పగించి
యెంచ రొస్తారని మిద్దెక్కి చూస్తే
తగ్గనా యేణిగిలు మిట్నగుర్రాలు
సాగెనే బంతులూ సనగొండ్లదంకా
యెసెనే యిస్తర్లు యెమకోటదంకా
యిద్దరికి వొక మెతుకు యిగ్గులాటాయె
ముగ్గరికి వొక మెతుకు ముగ్గులాటాయె
..............................................

*(త్రివేణి : 238)*

సమాజంలోని కొన్ని తరగతులలో వివాహానికి అయ్యే ఖర్చు ఆడపిల్ల తల్లిద్రండులే భరించే ఆనవాయితి ఉంది. ఆ సందర్భాన్ని పురస్కరించుకొని జానపదులు పాడుకుంటారు. పైది ఆడపెళ్ళి వాళ్ళు చేసిన ఏర్పాటులో తప్పులను ఎంచుతూ హాస్యధోరణిలో వెలువడిన గేయం. పై గేయంలో హాస్యమే కాకుండ ఒక సామాజిక నేపథ్యం తెలుస్తుంది. సమాజంలో వరుడు తరఫువారికి వధువు తల్లిదండ్రులు అన్ని ఏర్పాట్లు చేసి ఎటువంటి లోటు జరగకుండ చూడాలనే భావం వ్యక్తమవుతుంది.

## 4.2 ఆడపెళ్ళివారు, వరుడు – హాస్యం

ఆడపెళ్ళి వారు చేసే మర్యాదలను వద్దన్న వరుడిని ఆటపట్టించడం ఈ క్రింది గేయంలో మనకు కనిపిస్తుంది.

యేమాయా వో పెండ్లి కొడుకా యెంతకీరితి తెస్తివీ
వొంతకాగిన నీళ్ళు మేమూపోసి చూసామంటిమీ
తొట్టిలోనీ ముసురు నీళ్ళూ నాకి కావలెనంటివీ
సన్నబియ్యం కోడిపెట్టా మేము పెడతా మంటిమీ

రాగిముద్దా వులవచారా నాకి కావలెనంటివీ
పాత చాపలు వంద టరుగులు నాకి కావలెనంటివీ
పట్టెమంచం లేవు దిండూ మేము యిస్తామంటిమీ
నులకమంచం కమిటికోరే నాకి కావలెనంటివీ
..................................................

*(త్రివేణి : 241)*

సహజంగా అల్లుడికి స్నానానికి వేడినీళ్ళు పెట్టడం, భోజనంలో సన్నబియ్యం అన్నం కోడి పెట్టను వండడం, తూగుటుయ్యాల, పట్టెమంచం వేయడం మొదలైన ఏర్పాట్లు చేస్తారు. కాని ఈ గేయంలో అల్లుడు అవేవీ వద్దంటాడు. స్నానానికి తొట్టిలో వర్షపునీటిని, భోజనంలో రాగి ముద్దా ఉలవచారు, తూగుటుయ్యాలకు బదులు పాత చాపలు పట్టెమంచానికి బదులు నులక మంచం కోరుకుంటాడు. పేరంటాళ్ళు ఆ వరుణ్ణి ఆటపట్టిస్తారు. సమాజంలో అల్లుళ్ళు గొంతెమ్మ కోరికలు కోరడం అనేది ఉంది. అలాంటివి కోరకుండ ఉన్న దానితో సర్దుకు పోయే స్వభావం గల అల్లుణ్ణి పేరంటాళ్ళు ఆటపట్టించడం మనకు కనబడుతుంది. సర్దుకుపోయే మనస్తత్వం గల వ్యక్తులు కూడా ఉంటారని పై గేయం వల్ల వెల్లడి అవుతుంది

## 5. భార్యా భర్తలు – హాస్యం

గడుసరి అయిన భార్య భర్త మీద ఏవిధంగా పెత్తనం చేస్తుందో ఈ క్రింది గేయంలో ఉంది.

కంబదూరు కట్టకింద వోరిమొగుడా
నేను కందికలుపు తీయబోతే ఓరి మొగుడా
యెంద్రగిత్తి యేలు గొరికె వోరి మొగుడా
..................................................
నాకి గొడ్డు గొర్ని కొయ్యరాదా ఓ మొగుడా
నువ్వు కందిపప్పు జేసుకోర ఓరిమొగుడా
నాకిగోదుపరొట్లు కాల్చరాద వోరి మొగుడా
నువ్వు జొన్న రొట్లు కాల్చుకోర వోరి మొగుడా!

*(త్రివేణి : 232)*

సమాజంలో పురుషులపై అధికారం చూపే స్త్రీల ప్రవర్తన పై గేయంలో వెల్లడి అవుతుంది. అటువంటి స్త్రీలు ఏదో ఒక వంకతో భర్తపై పెత్తనం చెలాయిస్తారు. సహజంగా స్త్రీని తక్కువగా చూడడం అనేది కొన్ని కుటుంబాలలో ఉంటుంది. కుటుంబంలో ఆధిక్యతను

ప్రదర్శించే స్త్రీల ప్రవర్తనను వ్యక్తపరిచే విధంగా పై గేయం ఉంది. ఇటువంటి గేయాలను జానపదులు తమ తోటి స్త్రీలను ఆటపటిస్తూ హాస్యాస్పదంగా పాడుకుంటూ ఉంటారు.

## 6. స్త్రీ పురుష సంబంధాలు – హాస్యం

ఈ క్రింది గేయంలో సమాజంలో ఉండే స్త్రీ పురుష సంబంధాలు వెల్లడి అవుతున్నాయి.

యెట్లమ్మ ఈ సముసారమూ
నేనెదబడి కుదబడి చేసే విధమూ యెట్లమ్మ
యింటి మొగిడికి ఆవుల కుర్లా
పరాయి మొగుడికి దేశం కుర్లా
నడుమన దిరిగే వోబాళమ్మకు
కొమ్ములు దిరిగిన బఱ్ఱెను గొడ్డూ
.......................................

*(త్రివేణి : 233)*

పరపురుషునితో సంబంధం గల స్త్రీ, భర్తను ఏవిధంగా చూస్తుందనేది పై గేయంలో వ్యక్తమవుతుంది. ఇటువంటి సన్నివేశాలను కల్పించుకొని స్త్రీలు సరసాలాడుకుంటూ పాటలు పాడుకుంటారు. ఈ విధంగా జానపదులు హాస్య సన్నివేశాలకు సంబంధించిన హాస్య గేయాలను పాడుకుంటూ ఆనందంగా జీవిస్తారు.

## 7. సోమరి రైతు – హాస్యం

ఈ క్రింది గేయంలో సోమరి అయిన రైతు గురించి ఉంది.

యాలేస్తి నరసిరెడ్డి చెరకు దోటా
దాన్కి దాన్కె సరిపాయె
దమ్మిడి యన్న మిగల్లేదు
గాణిగింట్కి బొమ్మంటె
గంగింట్కి బోతావు
బళ్ళారిలోన బెల్లం
బెంట్లమ్మి వట్టుంది
అయగాళ్ళకింతపాయె
సాయగాళ్ళ కింతపాయె
అప్పులోళ్ళ కింత పాయె
అడిగినోళ్ళ కింతపాయె *(త్రివేణి. : 235)*

పై గేయంలో కష్టపడి పనిచేయని రైతు జీవన విధానం గురించి ప్రస్తావించబడింది. అతడు చెఱకుతోట వేసి సరైన శ్రద్ధ తీసుకోకపోవడం వల్ల అతనికి లాభంరాలేదు. పండిన పంటలో కొంత కూలీలకు, కొంత అప్పులోళ్ళకు, కొంత ఆయగాళ్ళకు సరిపోతుంది. అతనికి మాత్రం ఏమి మిగలదు. అటువంటి రైతుని హేళన చేస్తూ జానపదులు పై గేయం పాడారు. రైతు వ్యవసాయం చేసేటప్పుడు శ్రమకోర్చి పని చేయాలి. ఆవిధంగా చేయకపోతే అతని జీవితం దుర్భరమవుతుంది. అటువంటి రైతుకి కనువిప్పు కలిగేవిధంగా హాస్యాన్ని జోడించి జానపదులు పాడుతారు. పై గేయం సందేశాత్మకమైనది.

జానపదులు పాడుకునే హాస్య గేయాల వల్ల హాస్యం తోపాటు ప్రజల జీవన శైలి కూడా తెలుస్తుంది. జానపద సాహిత్యంలో స్త్రీ వైశిష్ట్యం ఎక్కువగా వ్యక్తమవుతుంది. ఏ గేయంలో చూసినా స్త్రీ ప్రస్తావన తప్పని సరిగా ఉంది. సమాజంలో స్త్రీకి వ్యవసాయపు పనులలో అవగాహన ఉంది. కుటుంబం కోసం పూజలు చేయడం, సంతానం బాధ్యతను స్వీకరించడం మొదలైన అంశాలలో స్త్రీయే ప్రధానకేంద్రమైంది. కొన్ని గేయాలలో పురుష భావజాలం వ్యక్తమవుతున్నప్పటికి స్త్రీ వాటిని అధిగమించే ప్రయత్నం చేసినట్లు కనబడుతుంది.

**ఉపయుక్త గ్రంథాలు**


1. కృష్ణకుమారి, నాయిని. 2007. తెలుగు జానపద గేయ గాథలు. తెలుగు అకాడమి, హైదరాబాదు.
2. గంగాధరం, నేదునూరి. త్రివేణి. 2006. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాయం, హైదరాబాదు.
3. మోహన్, జి.యస్. 2010. జానపద విజ్ఞానాధ్యయనం. ద్రావిడ విశ్వ విద్యాలయం, కుప్పం.
4. రామరాజు, బి. 1990. జానపద గేయ సాహిత్యము. జానపద విజ్ఞాన ప్రచురణ, హైదరాబాదు.




(యస్.వి.కె. పి & డా.కె.యస్. రాజు
ఆర్ట్స్ & సైన్స్ కళాశాల, పెనుగొండ. వెయ్యేళ్ళ తెలుగు సాహిత్య వైభవం
అంతర్జాతీయ సదస్సు, ప్రత్యేక సంచిక. ఏప్రిల్ 23, 2018).

# 4. కాటమరాజు కథలలో - కథన ఘటకాలు

**కథనఘటకం:** కథ ముందుకు నడవడానికి తోడ్పడే అంశాన్ని కథనఘటకం అంటారు. కథనఘటకాన్ని ఆంగ్లంలో Motif అంటారు. దీన్నే కొంతమంది 'కథన చోదకం' అని కూడా అంటారు. కన్నడంలో 'ఆశయ', 'ప్రేరక', కథనఘటక అని పిలుస్తారు. Motif అనగా The Smallest element in a tale having the power to persist in oral tradition అని Stith Thampson నిర్వచించారు. Motif ను మూలాంశం అని కూడా చెప్పవచ్చు.

*(మోహన్,జి.యస్. 2010 : 94)*

Motif కథావస్తువుని తెలియజేస్తుంది. సామాన్య విషయాలు కథన ఘటకాలు కానేరవు. జానపద కథల్లోను, కథా గేయాల్లోనే కాక, రామాయణం, మహాభారతం, భాగవతాలలో కూడా కథనఘటకాలను గుర్తించవచ్చు.

కాటమరాజు కథలలో అనేక కథనఘటకా లున్నాయి. వాటిని పరిశీలించినపుడు ఆ సంఘటన జరిగి ఉండకపోతే కథ వేరుగా ఉండేదేమో అనే భావన కలుగుతుంది. ఆయా సంఘటనల వల్ల కథ ముందుకు సాగిందని చెప్పవచ్చు. వాటి ఆధారంగానే కాటమరాజు కథలు ప్రాచుర్యం పొందాయి. అవి ఈ వ్యాసంలో పరిశీలించబడ్డాయి. కాటమరాజు కథలలోని కథనఘటకాలు (1) బసవన్న పూజలు (2) బ్రాహ్మణుల జోస్యము (3) పెంపుడు చిలుక (4) గంగ (5) దేవతాబొంగరాలు (6) శకునములు (7) సహగమనం (8) సంతాన ప్రాప్తికి దేవుడు ప్రత్యక్షమై ఒక పండు ఇవ్వడం.

### 1. బసవన్న పూజలు

ఆవుల వలురాజు వల్లమ్మలకు కొమరక్క అనే కూతురు, పెద్దిరాజు, సింహాద్రిరాజు, యరనూకరాజు, నలనూకరాజు, పోలురాజు అనే ఐదుగురు కుమారులు ఉన్నారు. పెద్దిరాజు భార్య పెద్దమ్మ. సింహాద్రిరాజు భార్య సింహాద్రిసీత. యరనూకరాజు భార్య యరనూకసీత. నలనూకరాజు భార్య నలనూకసీత. పోలురాజు భార్య సింహాద్రిసీత. ఈ కథలో యాదవ కాంత లందరు బసవన్నను పూజిస్తారు. పెద్దమ్మ బసవన్నను ఈ క్రింది విధంగా పూజిస్తుంది.

పెద్దమ్మ ఈ విధమున ప్రియము తోడుతను

హద్దుగా బసవన్నకు హారతులు పాడి
నెగడి హస్తముల నివాళిపట్టంగ

బేగడంపు దేవుడు పెద్దమ్మను చూడక
పగవాని వలె పరముఖ మాయె
.....................................
.....................................
పాప సంహరుడు పరముఖ మాయె
పాలు నెయ్యి పెరుగు బసవన్నకు పెట్టగా
కాలకంధరుండు కన్నులు మూసె

*(సుబ్బారావు, టి.వి. 1976 : 110-111)*

అపుడు బసవన్న సంతానం లేని పెద్దమ్మ పూజను తిరస్కరిస్తాడు. అపుడు పెద్దమ్మ ఎంతగానో దుఃఖించి నిద్రిస్తుంది. ఆమెకు కల్యాణ సోమేశరుడు కలలో కనిపించి, కల్యాణ నగరానికి వచ్చి తనను పూజిస్తే సంతానం కలుగుతుందని చెబుతాడు. ఆవిధంగా పెద్దమ్మ సంతాన కాంక్షతో కల్యాణ నగరానికి వెళ్లి, అక్కడ కల్యాణ సోమేశ్వరుణ్ణి పూజించి సంతానం పొందుతుంది. ఆ తరువాత ఆర్లపెంట రణంలో పెద్దిరాజు మరణిస్తాడు. పెద్దమ్మ సహగమనం చేస్తుంది. ఇక్కడ పెద్దమ్మ పూజను బసవన్న తిరస్కరించకపోతే కథ వేరుగా ఉండేది.

## 2. బ్రాహ్మణుల జోస్యము

పెద్దిరాజు, పెద్దమ్మలకు కాటమరాజు అనే కుమారుడు, పాపనూక అనే కుమార్తె జన్మిస్తారు. పెద్దమ్మ సహగమనం చేస్తూ వారిరువురిని సిరిదేవికి అప్పగిస్తుంది. సిరిదేవి, పాపనూకకు యుక్తవయస్సు వచ్చిన తరువాత వివాహం చేయాలని నిర్ణయించుకుంటుంది. అపుడు సిరిదేవి బ్రాహ్మణులను పిలిపించి పాపనూక గురించి అడుగుతుంది. అపుడా బ్రాహ్మణులు పాపనూక ఇల్లు వదలి వెళితే సిరిసంపదలు పోతాయని, నాచకూళ్ల నాయునికి, పాపనూకకు వివాహం కుదురుతుందని చెబుతారు. నాచకూళ్ళ నాయుని ఇల్లరిక ముంచమని కొమరక్క నడుగుతుంది. కొమరక్క అందుకు అంగీకరించదు. అపుడు బ్రాహ్మణులు వయసొచ్చిన ఆడపిల్లలు ఇంటిలో ఉండరాదని వేరే మేడలో పెట్టించమని చెబుతారు. ఆ విధంగా సిరిదేవి పాపనూకను ఒంటిస్తంభపు మేడ కట్టించి, అందులో ఉంచుతుంది. బ్రాహ్మణులు ఈవిధంగా జోస్యం చెప్పకపోతే, పాపనూక గురించి కథ వేరుగా ఉండేది. ఈ విధంగా పాపనూక జీవితమంతా ఒంటిస్తంభం మేడలోనే కడతేరుతుంది.

## 3. పెంపుడు చిలుక

కాటమరాజు నల్లసిద్ధిరాజు పుల్లరి ఒడంబడిక చేసుకుంటారు. నల్లసిద్ధిరాజు రాజ్యంలోని భూములలో ఆవులను మేపుకున్నందుకు బదులుగా కాటమరాజు ఆవులకు పుట్టిన లేగదూడలను నల్లసిద్ధిరాజుకి ఇవ్వాలి. కుందమాదేవి నల్లసిద్ధిరాజు రెండవ భార్య. ఆమె ఒక చిలుకను పెంచుకుంటుంది. ఆమె ఆ చిలుకను కాటమరాజు ఆవుల మంద పైకి వదులుతుంది.

చెలగియా కౌలావులు మెరునడియుండగాను
ఆమ్రమద్య దుందు ఆ చిలుక నిలచి
కాకిపలుకులు చిలుక గుబ్బటీలు గూసెను
గువ్వ పలుకులకు ధేన్వలు కల్లుగా చెదరెను

*(సుబ్బారావు. టి.వి. 1976 :138)*

ఆ పెంపుడు చిలుక వింత శబ్దాలను చేస్తూ కాటమరాజు ఆవుల మందను చెదర గొడుతుంది. ఆవులు బెదరి లేగలను తొక్కుతాయి. అపుడా లేగ దూడలు మరణిస్తాయి. ఆ కోపంతో కాటమరాజు చిలుకను చంపిస్తాడు. దానికి ప్రతీకారంగా కుందమాదేవి ఆవులను చంపిస్తుంది. నల్లసిద్ధిరాజే తన ఆవులను చంపించాడని కాటమరాజు పుల్లరి కట్టడం మానేస్తాడు. పర్యవసానంగా యుద్ధం జరుగుతుంది. ఇలా కాటమరాజు, నల్లసిద్ధిరాజుల మధ్య యుద్ధానికి పెంపుడు చిలుక కారణమవుతుంది. కుందమాదేవి పెంపుడు చిలుకను ఆవుల మందపైకి వదలకుండ ఉంటే కథ వేరుగా ఉండేది.

## 4. గంగ

పెద్దమ్మ అగుమంచి మొదలైన స్త్రీలకు గంగ కలలో కనిపించి వారి భర్తలు యుద్ధంలో మరణించినట్లు చెబుతుంది.

కాటమరాజు, భట్టావులరాజు మొదలైనవారు, వారి తండ్రులు ఆర్లపెంట రణంలో మరణించినపుడు కళేబరాలను తీసుకురావడానికి యుద్ధరంగానికి వెళతారు. అపుడా యుద్ధభూమిలో గంగ వాళ్ళ తండ్రుల శవాలను గుర్తించి చూపిస్తుంది. పెద్దమ్మకు కలలో గంగ కన్పించి కొన్ని వివరాలను చెప్పినపుడు ఆమె ఆ కల గురించి కల్యాణ నగరంలోని స్త్రీలకు చెబుతుంది. అపుడు వారు ఆమెకు ఆ కలనుబట్టి జరగబోయే సంఘటనలు చెబుతారు.

అలాగే అగుమంచికి కూడ గంగ కన్పించి కల చెబుతుంది. ఆమె ఆ కలను వీరగంగకు చెబుతుంది. అప్పుడు ఆమె దాని వలన జరగబోయే సంఘటనలను చెబుతుంది. ఈవిధంగా ఇలవేల్పు అయిన గంగ కూడ తన పాత్రను నిర్వహిస్తుంది.

*(సుబ్బారావు, టి.వి. 1976 : 614)*

## 5. దేవతా బొంగరాలు

దేవతా బొంగరాలు మహిమ గల బొంగరాలు. ఆ బొంగరాలతో ఆడిన రాజులందరు యుద్ధంలో మరణిస్తారు. సిరిదేవి కుమారుడు అయిన ముమ్మయ్య, అగుమంచి పెంపుడు కొడుకు అయిన పోచయ్య దేవతా బొంగరాలను అడుగుతారు. సిరిదేవి ఆ బొంగరాలను వారికి ఇవ్వడానికి భయపడుతుంది. కాని అగుమంచి ధైర్యం చేసి ఆ బొంగరాలను వారికి ఇచ్చినట్లు ఈ క్రింది పద్యం వల్ల తెలుస్తుంది.

అతివేగ దీవించి ఆగుమంచి ఇచ్చె
ప్రతివాదించక బాలల్లారా
వోడు గెల్పులు లేక ఉర్విపై మీరు
ఆడుడి బొంగరాలు హరిహరులు బోలి
పుచ్చుకొండి బాలల్లారా పుత్తడి బొంగరాలు

(సుబ్బారావు, టి.వి. 1976 : 266)

ఆ బాలురు దేవతా బొంగరాలు ఆడుతుండగా అవి కోమటి అచ్చమ్మ కాలికి తగులుతాయి. అపుడు మీ అన్నలకు పట్టిన గతి మీకు కూడా పడుతుందని ఆమె శపిస్తుంది. ముమ్మయ్య, పోచయ్యలు సిరిదేవి దగ్గరకు వచ్చి అన్నల గురించి తెలుసుకొని యుద్ధానికి వెళతారు. ఈ విధంగా దేవతా బొంగరాలు కథా గమనానికి తోడ్పడతాయి.

## 6. శకునములు

కాటమరాజు కథలో పురుషులు యుద్ధంలో మరణించినపుడు వారి భార్యలకు కొన్ని శకునాలు కనబడతాయి. అగుమంచి తలంటడానికి సిరిగిరమ్మ గిన్నెలో సంపెంగనూనె తీసుకొని వస్తుండగా ద్వారబంధం తగిలి నూనె వలుకుతుంది. ఆ విషయం ఈ క్రింది పద్యంలో జానపదులు వర్ణించారు.

రవణచు అగుమంచికి రమణి శిరస్సంట
సంపంగి నూనెలో చెలగి గిన్నెలలోను
సంపుతో నిడుకొని సుధతి సిరిగిరమ్మ
కరమున గాంచక రాగా కొంత తానప్పుడు
దాల చింద్రము దాకి తలచ మొగుచింద్య

(సుబ్బారావు, టి.వి. 1976 : 463)

అపుడు సిరిగిరిమ్మ తన భర్త యుద్ధంలో మరణిస్తాడని శకునం చెబుతుంది. అగుమంచి స్నానం చేసిన నీరు నిమ్మలకు పనసలకు ప్రవహిస్తుంది. అది చూచిన కొమరక్క, అగుమంచి సోదరులు పాలేటి యుద్ధంలో మరణిస్తారని శకునం చెబుతుంది. అగుమంచి శివుణ్ణి గంగను పూజించినపుడు అపశకునాలు కలుగుతాయి. దానికి కారణం చెప్పమని స్త్రీలందరు ఆమెని అడుగుతారు. అపుడు తన సోదరులు యుద్ధంలో మరణిస్తారని అగుమంచి జరగబోయే సంఘటనలు చెబుతుంది.

## 7. సహగమనం

కాటమరాజు కథలలో భర్తలు మరణించినపుడు భార్యలు సహగమనం చేయడం ఒక విధి. అది ఒక పవిత్రకార్యం. ప్రధాన పాత్రలైన పెద్దమ్మ, అగుమంచి మొదలైన స్త్రీలందరు సహగమనం చేస్తారు. ఈ క్రింది ఉదాహరణ గమనింపదగింది.

పెద్దమ్మ సహగమనం
కుంకుమ వసంతము కొల్లలుగాను
కుడిచేయి లోనుగా గుణ్ణము చుట్టూ
వలంపూరి తిరిగి వచ్చెను వేగ
.....................................
.....................................
అందము నిమ్మపండ్లు అగ్ని కట్టించె
గుప్పున గుణ్ణాన దుమికె పెద్దమ్మ

*(సుబ్బారావు, టి.వి. 1976 : 283)*

ఈ ఆచారం కాటమరాజు కథలలో స్త్రీ పాత్రపరంగా ఎంతో ప్రభావాన్ని చూపించింది. పెద్దమ్మ సహగమనం చేయకుండా జీవించి ఉంటే పాపనూకను తన ఇష్టం వచ్చినట్లు పెంచుకునేది. స్త్రీలందరకు నిండు జీవితం ఉండేది. యుద్ధంలో తండ్రి చనిపోయినా తల్లి బ్రతికి ఉన్నట్లయితే పిల్లల జీవితాలు మరొక విధంగా ఉండి ఉండేవి.

**8. సంతాన ప్రాప్తికి దేవుడు ప్రత్యక్షమై ఒక పండు ఇవ్వడం**

సంతానం లేని పెద్దమ్మ బసవన్నను పూజిస్తుంది. బసవన్న పెద్దమ్మ పూజను తిరస్కరిస్తాడు. పెద్దమ్మ దుఃఖించి నిద్రిస్తుంది. అపుడు ఆమె కలలో కల్యాణ సోమేశ్వరుడు కనిపించి కల్యాణ నగరానికి వస్తే సంతానాన్ని ఇస్తానని చెబుతాడు. అపుడు పెద్దమ్మ పెద్దిరాజు కల్యాణ నగరానికి వెళ్ళి కాటకోటేశ్వరుని పూజిస్తారు.

ఈ క్రింది వాక్యాలలో పెద్దమ్మ పెద్దిరాజు కళ్యాణ స్వామేశ్వరుణ్ని పూజించినట్లు తెలుస్తుంది.

ఓ కాత్రాయుడా కాట్లకోటేశ్వరా!
కాంతి సోమప్ప తమ గర్భమునందు
పరగంగ బాలలు జన్మించితేను
నీ పేరు పెట్టుదుము నిఖిలంబు ఎరుగ
.......................................
కాటకోటేశ్వరుడు అపుడు తామెచ్చి
కాయను పండును దోసిట రాల్చెను
కాయపండేమి అని కలలోన అడిగితే
కాయే కాటమరాజు పండే పాపనూక
అని శలవిచ్చె నపుడు శంకరుడు దయతో *(సుబ్బారావు, టి.వి. 1976 : 57)*

కాటకోటేశ్వరుడు వారి పూజకు మెచ్చి ఒక కాయను పండును ఇస్తాడు. వారిరువురు ఆ పండ్లను భుజించగా కాటమరాజు, పాపనూకలు జన్మిస్తారు. ఈ విధంగా కథాగమనానికి ఈ పండ్లు తోడ్పడినాయి.

ఈ విధంగా కాటమరాజు కథలలో స్త్రీ పాత్రలను ఆధారంగా చేసుకొని కథన ఘటకాలను పరిశీలించవచ్చు. ఇదేవిధంగా అనేక కథలలో కావ్యాలలో కూడ కథన ఘటకాలను పరిశీలించదగినవి ఉండవచ్చు.

**ఉపయుక్తగ్రంథాలు**


1. కృష్ణకుమారి, నాయిని. 1990. తెలుగు జానపద గేయగాధలు. తెలుగు అకాడమీ, హైద్రాబాద్.
2. మోహన్, జి.యస్. 2010. జానపద విజ్ఞానాధ్యయనం. ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పం.
3. సుందరం, ఆర్వీయస్. 1996. ఆంధ్రుల జానపద విజ్ఞానం. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైద్రాబాద్.
4. సుబ్బారావు, టి.వి. 1976. కాటమరాజు కథలు. నాగలక్ష్మి ఆర్ట్స్ ప్రింటర్స్, హైద్రాబాద్.




(భావవీణ ఏప్రిల్ 2019
ప్రధాన సంపాదకులు పిట్ట శాంతి,
గుంటూరు).

# 5. జానపద కళారూపాలు - దళితులు

నన్నయ్యకు పూర్వం నుండే జానపద సాహిత్యం ప్రచారంలో ఉందని చెప్పవచ్చు. పదం నుండి పద్యం పుట్టింది. మానవ సంస్కృతీ సంప్రదాయాలకు, ఆచార వ్యవహారాలకు ఆధారం జానపద కళలు. ఆధునిక సమాజంలో జానపదకళలు కనుమరుగైపోతున్నాయి. మన సంస్కృతిని, సంప్రదాయాలను మనమే మరచిపోయే ప్రమాదం ఏర్పడుతుంది. ఈ జానపద కళలు కొన్ని కులాలవారికి వంశపారంపర్యంగా వస్తున్నాయి. ఆ కళలే వారికి జీవనాధార మయ్యాయి. ప్రస్తుత సమాజంలో ఆ కళలకు సరైన ఆదరణ లేకపోవుట వలన ఆయా కళాకారులు కొందరు వ్యవసాయ కూలీలుగా జీవిస్తున్నారు. కొందరు విభిన్న వృత్తులను చేపడుతున్నారు.

ఈ జానపద కళాకారులు ఎక్కువగా దళితకులాల వారని, కడజాతివారని, వెలిజాతి వారని పిలువబడుతున్నారు. దళితులలో ముఖ్యంగా చెప్పుకోదగిన వారు మాల, మాదిగలు కొన్ని కళలను వంశపారంపర్యంగా ఈ నాటికి కొనసాగిస్తున్నారు. అవి హరినామ సంకీర్తనలు, తత్త్వాలు, పంచకథలు, బైనీటికథలు, పల్నాటి కథలు, కొమ్ముకథలు, వీధినాటకాలు, సోదికథలు, మాతంగి నృత్యాలు, డప్పులు వాద్యాలు, కర్రసాములు, మొదలగునవి. వాటిని దళితులు ఆదరించక పోయినట్లైతే కొన్ని కళలు అంతరించి పోయేవని చెప్పడంలో అతిశయోక్తి లేదు.

జానపద కళాకారులు మాలమాదిగలలోని ఈ క్రింది విధంగా గుర్తింపబడుతున్నారు. మాలదాసులు, బైనీడివారు, వీరవిద్యావంతులు, ఆసాదివారు, మాష్టినవారు పంబలవారు అనే వారు మాలలు. కొమ్ముటవారు, మాతంగులు, మాష్టినులు, చిందుభాగవతులు అనే వారు మాదిగలు.

**మాలదాసులు**

దళితులు సమాజంలో నిమ్నజాతులుగా పిలువబడుతూ అనునిత్యం అవమానాలకు గురవుతూ ఈ నాటికి జీవనాన్ని సాగిస్తున్నారు. క్రీ.పూ. 4, 5 శతాబ్దాలలో నిమ్నజాతీయులు హిందూమతంలో ఉన్న అసమానతలను సహించలేక అధిక సంఖ్యలో బౌద్ధమతాన్ని అవలంబించారని తెలుస్తుంది. బౌద్ధమతంలో వర్ణ వ్యత్యాసం లేకపోవడమే దీనికి కారణం.

కాలక్రమేణ హిందూమతంలో వైష్ణవం, శైవం అనే రెండు శాఖ లేర్పడ్డాయి. కొత్తగా వచ్చిన వీరశైవం కులభేదం లేకుండా అందరు సమానమనే నినాదాన్ని ప్రవేశపెట్టింది. దళితులలో కొందరు శైవమతాన్ని అవలంబించారు. అదే సమయంలో క్రీ.శ 11, 12, శతాబ్దంలో పల్నాటి సీమలో వైష్ణవ మతస్తుడు అయిన బ్రహ్మనాయుడు చాపకూటి సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టాడు. దళితులలో కొంతమంది ఈ సిద్ధాంతాలను అవలంభించారు. వీరినే రామానుజ కూటం అని పిలుస్తారు. వీరు మాలదాసరులు లేక మాలదాసులు లేక హరిదాసులుగా పేర్కొనబడ్డారు.

16వ శతాబ్దంలో శ్రీకృష్ణ దేవరాయలు ఆముక్తమాల్యాదలో మాలదాసరుల గురించి ఈ విధంగా తెలియజేశాడు.

**చ॥ కలడొకరుండు పేరుకొనగాని కులంబు మదీయ భక్తుడి**
**య్యిల మునువాడు వామన తనే వసియించిన పుణ్యభూమియం**
**దులకొక యోజన త్రయపు దూరపు టూరవసించి బ్రహ్మవే**
**ళల జను దెంచిపాడు మము లాలసమంగళకైశికిన్**

*(ఆముక్తమాల్యద :6-3)*

పంచమకులంలో పుట్టిన మాభక్తుడొకడున్నాడు. అతడు నేను వామనావతార మెత్తినపుడు దివ్య దేశానికి మూడామడల దూరాన గల ఒక గ్రామంలో నివసిస్తూ ప్రభాత సమయములందు మంగళ కైశికీ రాగంలో మమ్ములను గానం చేసేవాడు. అని పై పద్యంలో మాలదాసరుల ప్రస్థావన కలదు.

**సీ॥ చమురైన తోల్కు బుసంచుటెంకియునుని**
**త్తళి శంఖ చక్రకుండలములమర**
**దివెదారి కొమ్ము దోల్తిత్తియు జోడమ్ము**
**మెడమీది మొగలాకు గొడుగదనర**
**మత్పాద రక్షయు మావు పెన్వెఱకగు**
**ట్టిన యోటి తిపిరిదండెయును మొరయ**
**జెటితాళములు సంకపుటికి నొక్కొక మాటు**
**గతిరయంబున దాకి కలసి మొరయ**

**తే॥ వలుదవనమాల కంటెయు మలిన తనువు**
**బట్టె తిరుమన్ను బెదురు గెంబుట్టు జూపు**
**చినపు బొడితోలు వల్లంబు నెసకమెసగ**
**వచ్చు సేవింప సురియాళు వైష్ణవుండు**

*(ఆమూక్తమాల్యద : 6-6)*

చమురంటిన, తోలుచొక్కా, కుళ్లాయి, శంఖ చక్రముల వలె చెవుల పోగులు ఒప్పుచుండగా, భజన మున్నగు వానిలో దీపములుంచెడి దీపకంబము, తోలు తిత్తియు చర్మపు తిత్తియును, చేతితో పొడిచే బాణాన్ని, కేతకీ పత్రాలతో చేసిన ఛత్రము, మాపాదుకయును, గుఱ్ఱపు వెంట్రుక, సొరకాయతో తయారుచేసిన ఒక విధమగు వీణ ప్రకాశిస్తుండగా, చిఱుతాళములు చంకనున్న భవనాసిని గమనవేగం చేత కలిసి ధ్వని చేస్తుండగా తులసి పూసలమాలను ధరించి, మాసిన శరీరంతో, ఎఱ్ఱనైన బెదురు చూపులతో, పసుపు పట్టించిన కురుచనైనా చర్మపు జన్నిదమును ధరించి ఆ మాలదాసరి సేవించడానికి వచ్చినట్లు ఆముక్తమాల్యదలోని పై పద్యం వల్ల వెల్లడి అవుతుంది.

ఈ మాలదాసరులు ప్రత్యేక తెగగా ఏర్పడి, దళితులకు వివాహం చేయడం, అపరకర్మ లను నిర్వహించడం చేస్తుంటారు. ధనుర్మాసంలో హరినామ సంకీర్తన చేస్తారు. ఈ సమయంలో వీరి వేషధారణ ప్రత్యేకంగా ఉంటుంది. తలపై కలశం, భుజంపై తంబుర, చేతిలో చిడతలు, కాళ్ళకు గజ్జెలు, నుదుట తిలకం, తిరుచూర్ణం, భుజాలపై శంఖ చక్రాలు, మెడలో పూలదండలు వేసుకొని వేకువ జామున బ్రహ్మ ముహూర్తంలో ఇంటింటికి తిరిగి బిక్షను స్వీకరిస్తారు. ఈ విధంగా నెలంతా సంకీర్తనలు పాడి, మకర సంక్రాంతినాడు మంగళహారతి పాటలతో ఈ సంకీర్తనా కార్యక్రమాన్ని ముగిస్తారు. అపరకర్మలు నిర్వహించేటప్పుడు భుజంపై తంబుర ధరించి తాత్త్విక గేయాలు పాడుతూ మరణించినవారి ఇంటి నుండి సమాధి వరకు వెళ్లి అన్నాన్ని సమాధిపై ఉంచి మిగిలిన దానిని తరువాత వారు భుజిస్తారు. దీనిని మాలదాసులు ప్రధాన వృత్తిగా చేస్తారు. ఈ కార్యక్రమాన్ని రామానుజం కూటంవారు మాత్రమే రాత్రిపూట నిర్వహిస్తారు. ఈనాటికి దళితులలో కొన్ని కుటుంబాలవారు ఈ కర్మను రాత్రిపూట ఆచరిస్తున్నారు.

చెన్నకేశవస్వామి మాలలకు పగటి దివిటి, బొడ్డుగంట, పట్టెనామం, కలికితురాయి, చంద్రవంక మొదలగునవి ఇచ్చినట్లుగా చెబుతారు. మాల దాసరులలో ఉన్న వేరొక తెగవారిని, పల్నాటి ఆచారవంతులని చెబుతారు. వీరు గరుడ స్థంభంతో ఊరేగుతూ కత్తులతో విన్యాసాలు చేస్తారు.

దళితులు వివాహ సందర్భంలో వేంకటేశ్వరస్వామికి ఎదురు నడుస్తారు. పెళ్ళిరోజు ఉదయమే పెండ్లి కొడుకు తోపాటు అయిదుగురు బాలదాసులు, పది సంవత్సరముల లోపు మగ పిల్లలకు తలంబ్రాలు పోసి పూజలో కూర్చోబెడతారు. పెద్దలు, ముత్తయిదువులు కలిసి ఊరేగింపుగా బయలుదేరి ఊరి వెలుపులకు వెళ్ళి స్వామికి మొక్కులు తీర్చుకొనివస్తారు. ఈ సందర్భంలో పౌజు సేవ చేస్తారు. పౌజుసేవ అంటే పాత గుడ్డలు గాని, కొత్తగుడ్డలు గాని దివిటీల కర్రకు వలె చుట్టి నూనెలో ముంచి వెలిగిస్తారు. రెండు నుండి ఐదు దివిటీలు చేతితో పట్టుకొని వెలిగిస్తారు. ఒకరు గరుడస్తంభం పట్టుకొని నడుస్తుంటారు. మరొకరు రెండు

కత్తులు తీసుకొని గుండెపైన గుద్దుకుంటారు. ఈ విధంగా కత్తితో గుద్దుకున్న వారికి కత్తి తగిలిన చోట పసుపు చల్లుతారు. దీనిని పౌజు సేవ అంటారు. ఈ పౌజును మాలదాసులలో రెండవ తెగవారు నిర్వహిస్తారు. ఈ రెండు తెగలవారు వీధినాటకాలను ప్రదర్శిస్తారు.

## బైనీడివారు

జానపద కళారూపాలలో బైనీటి కథ ఒకటి దీనినే బయనీడి,బవనీడి, బయండ్ల అని కూడా పిలుస్తారు. బైనీడి కథ చెప్పే వాళ్ళను బయనీడివారు, పంబలవారు అని పిలుస్తారు. వీరు అధికంగా శైవమతాన్ని అవలంభిస్తారు. బైనీడివారి ఆరాధ్యదైవం ఎల్లమ్మ లేక రేణుకమ్మ వీరు శక్తి కథాగేయాలు గానం చేయడం వల్ల వీరిని శక్తిగాయకులని కూడా పిలుస్తారు. వీరు గౌతుపురాణం, ఎల్లమ్మకథ, గంగజననం, పెద్దిరాజుకథ, మాతపురాణం, అంకమ్మకథ, పరశురామ యుద్ధం మొదలగునవి కథలు గానం చేస్తారు.

## పంబలవారు

బయనీడి ఒకతెగవారు. వారు కథను గానం చేసేటపుడు 'బవనిక' అనే వాద్యాన్ని వాయిస్తారు. కాబట్టి వీరిని బయండ్లవారు, బయనీడివారు అని పిలుస్తారు. 'బవనిక' నే 'జమనిక' అని కూడా పిలుస్తారు. కొందరు 'పంబ' అని మరొక వాద్యాన్ని వాయిస్తారు. కనుక వీరిని పంబలవారు అని పిలుస్తారు. దుర్గాదేవికి భవాని అనే పేరుంది. భవాని గురించి గానం చేస్తారు కాబట్టి 'బవనీడు' అనే పేరు ప్రచారంలోకి వచ్చినట్లు చెబుతారు. శ్రీనాథుడు క్రీడాభిరామంలో బవనీల గురించి ఈ క్రిందివిధంగా తెలియచేశారు.

**సీ॥ కక్ష నిక్షిప్తి వికస్వర స్వరవిలా**
**స శ్రీనివాసంబు జవనికందు**
**గట్టిన తంత్రికిం గంతశ్రుతిక గూడ**
**జొక్కంబుగా నారి సొబగుమీఱ**
**నాలాపముల శుద్ధ సాళవసంకీర్ణ**
**వివిధ రాగంబుల చవులు చూపి**
**దమదమ ధ్వనుల బోటారింప యెడనెడ**
**గత్తెర మార్గంబు బిత్తరిల్ల**

**తే॥ వాద్య వైఖరిగడు నెఱ వాదియనగ**
**నేక వీరామహాదేవియెదుటనిల్పి**
**పరశురాముని కథలెల్ల బ్రౌడబాడె**
**జారుతర కీర్తి బవనీల చక్రవర్తి**

*(క్రీడాభిరామం: 37)*

ఈ బవనీలు రేణుక అమ్మవారి కొలుపులలో ప్రధానకర్తలుగా వ్యవహరిస్తారు. మాలమాదిగలు ఇద్దరు శక్తి కథలను గానం చేస్తారు. మాదిగలు జమిళిక తోపాటు పంబను కూడా వాయిస్తారు. మాలలు జమళికను వాయించరు. పంబను మాత్రమే వాయిస్తారు. అందుచేత మాదిగలలో గాయకులను పంబలవారని అంటారు. మాదిగలలో బైనీడివారు గురువులుగా వ్యవహరిస్తారు.

## కొమ్ముమ్మవారు

అమ్మవారి కొలుపులలో మాదిగలలోని ఒక తెగవారు కొమ్ము ఊదటంవల్ల వారిని కొమ్ము వారని పిలుస్తారు. గ్రామదేవత కొలుపులు ప్రారంభించే ముందర కొమ్ము ఊదుతారు. కొమ్మువారు కొమ్ము ఊదగానే గ్రామస్థులు కొలుపులు మొదలవు తున్నాయని గ్రహిస్తారు. ఈ కొమ్ము ఇత్తడితో పొడవుగా చేయబడి ఉంటుంది. దాని ముందు భాగం పాముపడగవలె ఉంటుంది. వీరు అమ్మవారి ఊరేగింపులో కొమ్ము ఊదుతూ ముందుకి వెళతారు. ఆ తరువాత వారి వెనక పంబవారు వీరతాళ్ళువారు కూడా వెళతారు. అమ్మవారి కథను గానం చేసే నాయకుడు పొడవైన తెల్ల అంగీ ధరిస్తాడు. కొందరు తెల్లపంచె, ఎర్రపంచెను కూడా ధరిస్తారు. తలపాగ చుట్టుకొని కాలికిగజ్జెలు కట్టుకొని నుదుట పెద్ద కుంకుమ బొట్టు పెట్టుకొని ముంజేతికి కడియం, కాలికి గగ్గెర ధరిస్తారు. వీరు కథను చెప్పేటపుడు కత్తి, డాలు, పంబజోడు, జమలిక, శ్రుతి (తోలుతిత్తి) మొదలగునవి పరికరాలను వాడతారు. కత్తి నాలుగు అడుగులు పొడవు ఉంటుంది. దీనిని ఇనుముతో చేస్తారు. ఇది సన్నగా పదునులేకుండా ఉంటుంది. డాలును ఇత్తడితో చేస్తారు. దీని కింది భాగంలో పట్టుకోడానికి వీలుగా రేకు బిగిస్తారు. పైభాగం వంపులు తిరిగి ఉంటుంది. పంబజోలు 1.5 అడుగుల పొడవు, తొమ్మిది అంగుళాల వెడల్పుగల గొట్టాలను రెంటింటిని తయారుచేసి, వాటికి చర్మంతో తయారుచేసిన మూతలను బిగిస్తారు. రెండు పుల్లలతో ఆ చర్మంపై వాయిస్తారు. అపుడు కణకణమనే శబ్దం వస్తుంది. మొట్టమొదట కథను చెప్పేటప్పుడు జమలికను వాయించేవారు. తరువాత పంబజోడు వచ్చింది. జమలికను ఇత్తడితో అడుగున్నర పొడవు, అడుగు వెడల్పు గల గొట్టాన్ని చేసి, ఒకవైపు చర్మం బిగిస్తారు. ఆ చర్మం మూతికి దారం కట్టి ఒకచేత్తో దానిని మోగిస్తారు. రెండవవైపు ఖాళీగా ఉంచుతారు. తోలుతో తిత్తిని తయారుచేసి రెండు రంధ్రాలు పెడతారు. ఒక రంధ్రంలో గాలి లోపలికి ఊదుతారు. రెండవ రంధ్రానికి మోములు బిగిస్తారు. మోముల గుండా గాలి బయటకు వచ్చేటప్పుడు సన్నని నాదం పుడుతుంది. దీన్ని శ్రుతి పట్టడం అంటారు. ఈ విధంగా మాలమాదిగలు శక్తి కథలు గానం చేస్తూ జీవిస్తున్నారు.

## వీరవిద్యావంతులు

వీరవిద్యావంతులు పల్నాటి వీరుడయిన కన్నమదాసుకు సంబంధించిన వారుగా చెబుతారు. వీరు క్రీ.శ 12వ శతాబ్దం నుండి ఉన్నారు. వీర విద్యావంతులు, మాలలు. వీరు

పల్నాటి కథలను మాత్రమే గానం చేస్తారు. వీరు వివాహ సందర్భాలలో, అపరకర్మ సందర్భాలలో, పండుగలలో ఈ కథలను గానం చేస్తారు. ప్రతి సంవత్సరం కార్తీక మాసంలో కారెంపూడిలో పీఠాధిపతులు వీర్ల ఉత్సవాలు నిర్వహిస్తారు. వీర విద్యావంతులు ప్రతి ఒకరు ఉత్సవాలలో కథను గానం చేస్తారు. ఈ వీర్ల ఉత్సవాలలో పాల్గొనే ప్రతివారు తమ కుంతములు తీసుకొని వెళ్ళి చెన్నకేశవస్వామి ఆలయంలో పూజించుకుని వస్తారు. వీరు ఆ కుంతములు చెన్నకేశవ స్వామి కుంతములు, బ్రహ్మనాయుని కుంతములు, నృసింహ కుంతములుగా భావిస్తారు. పల్నాటి వీర్ల అంకమ్మ గుర్తుగా ఓ కలశాన్ని అలంకరించి వెదురుబుట్టలో పెట్టి పూజిస్తారు.

పల్నాటి వీరగాథను గానం చేయడం గురించి క్రీడాభిరామంలో ఈ క్రింది విధంగా ఉంది.

**మ॥ ద్రుత తాళంబున వీర గుంపిత కదుంధుంకిటాత్కారసం**
**గతివాయింపుచు నాంతరాళికయతి గ్రామాభిరామంచుగా**
**యతిగూడం ద్విపద ప్రబంధమున వీరనాకముంబాడెనొ**
**క్కతె ప్రత్యక్షరముంగు మారకులు ఫీల్కారంబునందూలగన్**

*(క్రీడాభిరామం : 116)*

ఈ కథను నలుగురు వ్యక్తులు గానం చేస్తారు. ఒకరు కథను గానం చేస్తుండగా ఒకరు వీరణం వాయించడం మరొకరు శ్రుతి పట్టడం చేస్తారు. వేరొకరు వంత పాడుతారు. పల్నాటికథను చెప్పేవారి జోడును వీరణం అంటారు. పంబజోడు కంటె గొది సన్నగా ఉంటుంది. ఈ కథను గానం చేసే వ్యక్తిని ప్రధాన కథకు డంటారు. అతడు తెల్లని పొడవైన అంగి ధరిస్తాడు. 12 మూరల తలపాగ, నడుముకు గుడ్డ కట్టుకుంటాడు. అంతేగాక పట్టె నామాలు, కలికితురాయి, చంద్రవంక, కాళ్ళకు గజ్జెలు, కుడికాలికి బిరుదు గగ్గెర, రొమ్మున జంధ్యంగుడ్డ, బొడ్డుగంట, ఒకచేతికత్తి, ఇంకొక చేత్తోడాలు పట్టుకుంటాడు. వీర విద్యావంతులు ఆహ్వానం లేకపోయినా ఉత్సవాలలో పాల్గొంటారు. ఈ వీర విద్యావంతులను అనుగురాజు భార్య అయిన వీరవిద్యాదేవి పెంచి పోషించిందని, కాబట్టి వారికి వీర విద్యావంతులు, చెన్నయదాసులు, చెన్నయ దాసర్లని అంటారని ఒక కథ ప్రచారంలో ఉంది. పల్నాటి వీరులను పూజించే ఆచారాన్ని వీరాచారమంటారు. కొత్తగా వీరాచారాన్ని స్వీకరించేవారు పీఠాధిపతి ద్వారా తీసుకుంటారు. ఈ ఆచారాన్ని స్వీకరించదలచిన వారు కుంటుంబాలతో వచ్చి వీర విద్యావంతులు వేసిన ముగ్గుపై కూర్చుంటారు. అపుడు పీఠాధిపతి పాలు తేనె, గంధం కలిపిన ముద్రలు వీరతాళ్ళతో వేస్తాడు. బొట్టు కూడా పీఠాధిపతి పెడతాడు. ఇది వీర్ల గుడిలో జరుగుతుంది. ఈ ఆచారాన్ని స్వీకరించిన వారికి మాత్రమే కొలుపులలో పాల్గొని మొక్కులు తీర్చుకునే అర్హత ఉంటుంది.

## మాతంగి

దళితులలో మాదిగ కులానికి చెందిన స్త్రీలు మాతంగులుగా జోగినులుగా మార్చబడుతున్నారు. ఈ కులంవారు తమ మొదటి సంతానాన్ని గ్రామదేవతకు అంకితమిస్తారు. వీరు తమ కూతురుని మాతంగిగా మార్చడం అదృష్టంగా భావిస్తారు. మాతంగిగా మారిన బాలికకు వివాహం చేయరు. ఈ మాతంగి వ్యవస్థ కొన్ని కుటుంబాలలో వంశపారంపర్యంగా వస్తుంది. గ్రామంలో ఒక వ్యక్తి చేత మాతంగిగా మార్చబడిన బాలికకు కన్నెరికం చేయించి తాళికట్టిస్తారు. ఆ కల్యాణాన్ని మాతంగి కల్యాణ మంటారు. ఆ బాలిక ఆ రాత్రికి తాళికట్టిన వ్యక్తితో సంసారం చేస్తుంది. ఆ తరువాత గ్రామంలో పెద్దవ్యక్తులు ఎవరు పిలిచినా వారికి శారీరక సుఖాన్ని అందజేయాలి. ఆ బాలికకు కొలుపులలో ఏమేమి చేయాలో నేర్పిస్తారు. కొలుపులు 1 రోజు లేక 3 రోజులు లేక 5 రోజులు నిర్వహిస్తారు.

ఆమెను వేరొక గ్రామంలో కొలుపులకు కూడా తీసుకొని వెళతారు. ఆమె ఆ కొలుపులు నిర్వహించే వ్యక్తికి కూడ శరీరక సుఖాన్ని అందించాలి. ఆ సమయంలో మాతంగి ఎవరిని ఎదిరించరాదు. ఈ మాతంగులు కొలుపులలోనే పాల్గొంటారు. మాతంగి కొలుపులలో పాల్గొనడాన్ని "మాతమైల జరపటం" అంటారు. కొలుపులు మొదలుపెట్టేముందు మాతంగి గ్రామపెద్దల ఇళ్ళకివెళ్ళాలి. ఈ మాతంగి వ్యవస్థ ప్రాచీనకాలం నుండి ఉన్నట్లు శ్రీనాథుడు క్రీడాభిరామంలో ఈవిధంగా తెలియజేశాడు.

**మ॥ అకలంకస్థితిగోరి కొల్చెదరు బ్రహ్మానంద భావంబునన్**
**సకలానందమయైక మాత లగుచున్, సంతోష చిత్తంబునన్**
**తన దుందుమ్ముల్ తాళములు జవనికల్ తందాన లమ్మయ్యకున్**
**ఏక వీరమ్మకుమాహురమ్మకు నథోహ్రీంకార మధ్యాత్మకున్**

*(క్రీడాభిరామం : 132)*

## కొలుపులు

ఈ కొలుపులు ఆదివారంతో ముగిసేలా ప్రారంభిస్తారు. ఈ ఉత్సవం మొదలు పెట్టడానికి ముందురోజు ధర్మకర్త ఇంటి నుండి ముద్రగడను ఊరేగింపుతో అమ్మవారి గుడికి చేరుస్తారు. కొలుపులు కొమ్ము నాదంతో మొదలవుతాయి. కొమ్ము వారు మొదటి రోజు సిద్ధి పెడతారు. రెండవరోజు కుంభం వడ్డిస్తారు. మూడవరోజు మాతంగితో కలిసి ముందుగా జమ్మి చెట్టు దగ్గరకు వెళ్ళి ఊరేగింపుతో మొదలుపెడతారు. ఊరేగింపులో కొంతమంది ముద్రగడ పట్టుకొని వెళుతుంటారు. కొంతమంది వీరతాళ్ళతో ప్రదర్శనలిస్తారు. బవనీడివారు జమలికను పంబను వాయిస్తారు. మాతంగి వాటికి తగినవిధంగా చిందులు వేస్తుంది. ఈ బవనీడివారు మధ్యలో అమ్మవారికథను చెబుతారు. తెల్లవారు జామునకు ఊరేగింపు అమ్మవారి

గుడి దగ్గరకు వస్తుంది. గుడి దగ్గరకు వెళ్ళిన తరువాత అయిదు రంగుల ముగ్గును వేసి, అమ్మవారి కథను చెబుతారు. కథపూర్తయిన తరువాత అమ్మవారికి బలులిస్తారు. పొంగళ్ళు పెట్టుకొని నైవేద్యాలు చెల్లిస్తారు.

మాతంగి బుట్టని, గవ్వల దండ, గజ్జెలను ధరిస్తుంది. ఈ విధంగా మాతంగి కొలుపులలో పాల్గొనడం వలన ఆ గ్రామానికి మేలు జరుగుతుందని ప్రజలు నమ్ముతారు. ఈ కొలుపులను గొల్లలు, వడ్డెరలు, రజకులు కొన్ని గ్రామాలలో మాలవారు జరుపుతారు. కుమ్మరివారు గ్రామదేవతల పూజలలో ప్రధానపాత్ర వహిస్తారు. గొల్లవారు వీరతాళ్ళతో ప్రదర్శనలిస్తారు. బవనీడివారు అమ్మవారి కథను గానం చేస్తారు. కథకుడు ఒక చేతిలో కత్తి, మరొక చేతిలో డాలు ధరించి కథ చెబుతాడు కొందరు పూనకం వచ్చి గెంతుతుంటారు. పూనకం వచ్చిన వారిపై పసుపు నీళ్ళు చల్లి సాంబ్రాణి, గుగ్గిలం పొగ వేస్తుంటారు. ఈ విధంగా గ్రామాలలో కొలుపులు జరుపుతారు.

## మాలమాష్టినులు

దళిత కళాకారులలో చెప్పుకోదగ్గవారు మాలమాష్టినులు. వీరు వృత్తి గాయకులని, మాలలు ఆశ్రిత కులం వారని, మాల కులపురాణం గానం చేస్తుంటారు. మాలకులం మూల పురుషుడు మాలచెన్నయ్య అని లోక ప్రతీతి. వీరు మాల చెన్నయ్య పురాణం చెప్పేటపుడు శివకంఠమాలకథ, వనసింగల బేతాళకథను కూడా గానం చేస్తారు. వీరు శివకంఠమాల పురాణం గానం చేసేటప్పుడు మాలకుల మూలపురుషుడు బేతాళుడు అని చెబుతుంటారు. కాలక్రమేణ జానపద కళలు అంతరించిపోవడం వల్ల వీరు వడ్రంగి పని చేసుకొని జీవనం సాగిస్తున్నారు. వీరు నిరక్షరాస్యులు వంశపారంపర్యంగా వస్తున్న కళ  కాబట్టి వినికిడి ద్వారా ఈ పురాణాలను గానం చేస్తారు.

వీరి గురించి ఒక కథ కూడ ప్రచారంలో ఉంది. మార్కాపురం చెన్నకేశవస్వామి వరంతో బేతాళుడు పుడతాడు. అతనిని పేదరాశి పెద్దమ్మ పెంచి పెద్దచేస్తుంది. అతనికి ఐదుగురు భార్యలుంటారు. సంతానం కలుగలేదు. బేతాళుడు సంతానం కోసం ప్రతిరోజు ఓరుగల్లు రామలింగేశ్వర స్వామిని పూజించేవాడు. అయినప్పటికి అతనికి సంతానం కలగక పోవడం వల్ల, ఆ బాధతో ఒక కఱ్ఱావుని కోసి దొబ్బలు తోరణాలుగా కట్టి, పేగులు లింగానికి జెందంగా వేసి, రక్తంతో ద్వారాలు అలికి, మాంసం కాల్చి నైవేద్యంగా పెడతారు. ఇదంతా చూసిన శివుడు అసహ్యం వేసి గుడివదలి వెళ్ళిపోతాడు. బేతాళుడు కోపంతో ఆలయాన్ని పడగొడతాడు. బేతాళుడు కోపంతో శివాలయాన్ని పడగొటతాడు. అపుడు శివుడు కోపించి యలమంచిలి. సింహాద్రిరాజుకుమారుడు కరియావులరాజును పంపిస్తాడు. అపుడు ప్రతాప రుద్రుని సమక్షంలో బేతాళునికి కరియావులరాజుకి యుద్దం జరుగుతుంది. ఆ యుద్ధంలో

బేతాళుడు మరణిస్తాడు. కరియావులరాజు బేతాళుని పరాక్రమానికి మెచ్చి ప్రతి దసరానాడు మేకను బలిచ్చి జమ్మిఆకులను వీరారాధనగా సమర్పిస్తాడు. ఈ బేతాళుడే మాలమాష్టీనుల మూలపురుషుడని చెబుతారు. *(సుబ్బారావు, టి.వి. 1976 : 679)*

## మాదిగ మాష్టీనుడు

వీరు మాదిగలను ఆశ్రయించి జీవిస్తారు. కాబట్టి వీరిని మాదిగ మాష్టీలని పిలుస్తారు. వీరు దేవతా ఉత్సవాలలో, పెళ్ళిళ్ళలో కర్రసాములు, బండలు ఎత్తడం మొదలగునవి చేస్తారు. వీరు ప్రస్తుతం కృష్ణా, గుంటూరు, ప్రకాశంజిల్లాలలో వడ్రంగి పనిచేస్తున్నారు. వీరు తెలంగాణ ప్రాంతంలో కిన్నెరవాయిస్తూ మియసాబ్ కథ చెబుతారు. వీరు కిన్నెరతోపాటు డక్కుకూడా వాయిస్తారు. వీరిని డక్కు వాయించడం వల్ల డక్కలివారు అంటారు. తెలంగాణ ప్రాంతంలో డక్కలివారు బిక్షుక గాయకులుగా జీవనం సాగిస్తున్నారు. వీరు సర్వాయి పాపన్న కథ, సదాశివరెడ్డి కథలను గానం చేస్తారు.

## మాల ఆసాదులు

గ్రామదేవతలకు పూజాకార్యక్రమాలు నిర్వహించేవారు మాల ఆసాదులు. ఆసాదులు అంటే ప్రజల బాధలను దేవతలకు విన్నవించే మధ్యవర్తులు. ఈ ఆసాదులు గ్రామదేవతలకు నిత్యం పూజచేస్తారు. వీరు కొలుపులు జరిపేటప్పుడు శక్తిగీతాలు, పాడుతూ అర్చనలు చేస్తారు. వీరు మాల కులస్తులే గాని పూజారి పాత్రపోషిస్తారు. కాబట్టి వీరిని ఆసాదులని పిలుస్తున్నారు. కొన్ని ప్రాంతాలలో ఆసాదివారు మాదిగ కులస్తులు కూడ ఉన్నారు.

ఆసాదులను గురించి సమాజంలో ఒక కథ ప్రచారంలోఉంది. బ్రహ్మణ కరణంగారి అమ్మాయిని ఒక దళితుడు ప్రేమిస్తాడు. అతడు ఆమెను వివాహం చేసుకోవాలనుకుంటాడు. అతని కోరిక నెరవేర్చుకోటానికై వేదాలు, పురాణాలు, అభ్యసించి బ్రాహ్మణుని వేషంలో ఊరి జనం మెచ్చుకొనే విధంగా ప్రవర్తిస్తాడు. ఆ ఊరి ప్రజలు కరణాన్ని ఒప్పించి, అతని కుమార్తెతో దళితుడికి వివాహం జరిపించి కరణీకం కూడా ఇప్పిస్తారు. వీరికి ఇద్దరు కుమారులు జన్మిస్తారు. ఆ తరువాత కరణంగారు మరణిస్తారు. ఒకనాడు అతని కుమార్తె పుట్టింటికి వస్తుంది. కాని కోడలికి ఆమె మాటలు తీరు ప్రవర్తనపై అనుమానం వస్తుంది. చివరకు అతడు మోసం చేసి వివాహం చేసుకున్నాడని తెలుసుకుంటుంది. ఆ తరువాత ఆమె ఇంటికి నిప్పు పెట్టుకొని ఆత్మహత్య చేసుకుంటుంది.

ఇటువంటి కథే పుంగనూరు, వాయల్పాడుతాలుకా (చిత్తూరుజిల్లా)లో మరోవిధంగా ప్రచారంలో ఉంది. శూద్రుడు పురాణాలను చదివి బ్రాహ్మణుడని చెప్పుకొని వివాహం చేసుకుంటాడు. ఆ తరువాత వాస్తవం తెలిసి భార్య భర్తను ఎనుబోతు అవ్వమని శపిస్తుంది. ఆ ఎనుబోతు ఆమెను వెంబడిస్తుంది. అప్పుడామె భయపడి పుట్టలో దాక్కుంటుంది. అప్పుడా

స్త్రీ ఎనుబోతులను నరికి రక్తాన్ని నుదుట అలంకరించుకుంటానంటుంది. ఆమె గంగమ్మ అని చెబుతారు. ఉగాదికి ముందువచ్చే మంగళవారం గంగమ్మ జాతర జరుపుతారు. కొన్నిచోట్ల చైత్ర వైశాఖ మాసాల్లో ఒక మంగళవారం నాడు గంగమ్మ జాతర జరుపుతారు. అదే నేటికి చేస్తున్నారు. *(సుందరం. ఆర్వీయస్ .2004 : 320)*

ఆమె ఆత్మ కొందరిలో ప్రవేశించి 'నన్ను దగా చేసి పెండ్లి చేశారు కనుక ఊరిని నాశనం చేస్తాన'ని చెబుతూ భయపెడుతుంది. ఊరి జనం భయపడి తప్పును క్షమించమని అందుకు పరిష్కారంగా కొలుపులు నిర్వహిస్తామని వేడుకుంటారు. కాని ఆమె అతని శిరస్సు కావాలని కోరుకుంటుంది. వారు అట్లే అతనిని బంధించి శిరస్సును నరికి ఆమెకు నైవేద్యం పెడతారు. ఆమె తన ఇద్దరు కుమారులను పూజారులుగా ఉండమని కోరుతుంది. ఆ వంశము వారే ఆసాదులుగా పిలువబడుతున్నారు. వీరు కొలుపుల సమయంలో కథాగానం చేస్తారు. ముఖ్యంగా వీరు రేణుకమ్మ, ఎల్లమ్మ, పెద్దమ్మ, పోలేరమ్మ, అంకమ్మ మొదలగు గ్రామదేవతల కథలు గానం చేస్తారు. ఈ విధంగా మాల ఆసాదులు పూజారులుగాను, కథా గాయకులుగాను చెలామణి అవుతున్నారు.

ఈ విధంగా ఎంతోమంది దళితులు సమాజంలో దుర్భర జీవితాన్ని గడుపుతున్నారు. కారణమేమనగా నేటి సమాజంలో జానపదకళలకు సరైన ఆదరణ లేకపోవటమే.

**ఆధార రచనలు**


2. సుబ్బారావు, టి.వి. 1976. కాటమరాజు కథలు. నాగలక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాద్.

2. వేంకటశాస్త్రి, వావిళ్ళ. 1969. ఆ మూక్తమాల్యద వావిళ్ళ రామస్వామిశాస్త్రులు, అండ్‌సన్స్ మద్రాసు.

3. వల్లభరాయ, వినుకొండ. 1988. వీధినాటక ప్రబంధము "క్రీడాభిరామము" మణి మంజరి ప్రచురణలు వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్ట్, హైదరాబాదు.

4. ప్రతాపరెడ్డి, సురవరం. 2007. ఆంధ్రుల సాంఘిక చరిత్ర. చరిత్ర ఇంప్రెషన్స్, హైదరాబాద్.

5. క్షేత్ర పర్యటన.




(ప్రపంచీకరణ నేపథ్యంలో జానపద విజ్ఞానం పరిరక్షణ. జాతీయ సదస్సు, ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం ఫిబ్రవరి, 9-10-2018)

*(వ్యాసదీపిక, ప్రధాన సంపాదకులు. పి. ఉషారాణి. 2018. రోషన్ పబ్లికేషన్స్, విశాఖపట్నం).*

# 6. జానపద నృత్యం - తప్పెటగుళ్ళు - పరిరక్షణ

## జానపద కళల ఆవిర్భావం

**ఆ**దిమానవులు కొంతమంది సూర్యుణ్ణి ఇంకో గుంపు నదులు వృక్షాలతో కూడిన ప్రకృతి మాతను పూజిస్తారు. ప్రకృతిలో ఉన్న పుష్పాలను కందమూలాలను స్త్రీ పురుషులు నైవేద్యంగా సమర్పిస్తారు. వారికి సంతోషం కలిగినపుడు కేకలు వేస్తారు ఆ కేకలే పాటలైనాయి. స్త్రీలు, పురుషులు కేరింతలు కొడుతూ పాటలు పాడతారు. ఇలా వారి సంతోషాన్ని పాటలతో, ఆటలతో వెల్లడించి ఆదిమ మానవులు జానపద కళలకు పునాదులు వేశారు.

ఆనాటి ఆటవికులకు ప్రతి నిత్యం ఆహార సమస్య ఉండేది. అడవిలో మగ్గిన పండ్లు, దుంపలు, జంతువుల పచ్చి మాంసాన్ని వారు తినేవారు. ఆహార సాధనలో గుంపుల మధ్య కలహాలు వచ్చేవి. అప్పుడు భీకరమైన కేకలు గంతులు వేసేవారు. విజయం సాధించినపుడు విజయానందంతో వీరనృత్యాలు చేసేవారు.

కాలక్రమేణ రాత్రివేళ పండువెన్నెలలో స్త్రీ పురుషులు పాటలు పాడుతూ నృత్యాలు చేసేవారు. వర్షాలకోసం పాటలు పాడుతూ, ఆటలు ఆడుతూ కేకలు వేస్తూ ఉత్సవాలు చేసేవారు. క్రూరమృగాల బారినుండి తమనితాము రక్షించుకోడానికి ఆయా మృగాల వేషధారణ చేసేవారు. వాటి అరుపులతో అభినయంతో కదలికలతో వెళ్ళి వాటిని సంహరించి వాటి మాంసాన్ని ఆహారంగా తెచ్చుకొనేవారు. కొన్ని జంతువుల చర్మాలను వెదురు బొంగులను ఉపయోగించి వాద్యాలను తయారుచేసుకునేవారు. ఈవిధంగా ఆటవికులు తమ జీవనోపాధి కోసం నృత్య గానాలను చేసేవారు. కాలక్రమేణ అవే జానపదకళలుగా రూపొందాయి. ఈవిధంగా జానపద కళలకు అంకురార్పణ జరిగింది.

## నృత్యాలు– నాగ నృత్యం

ఆదిమ మానవుడు తొలిదశలో నాగ నృత్యం, మయూర నృత్యం చేసేవాడు. నాగ నృత్యం చేయ్యాలంటే పాము ఆడడం చూడాలి. దాన్ని అభినయించాలి. మనిషి మెలికలు తిరుగుతూ పాముకాటు తిన్న మనిషిలా, కళ్ళలోను, ముఖంలోను అభినయాన్ని చూపిస్తూ నృత్యం చేసేవారని తెలుస్తుంది.

## మయూర నృత్యం

మేఘాలు పట్టినపుడు చల్లని గాలులు వీచినపుడు పింఛాన్ని విప్పి నెమలి నాట్యం చేస్తుంది. అదేవిధంగా మానవుడు కూడా చేతులతో, నడుముతో ముఖ భావాలతోనే ఆ నృత్యాన్ని చేస్తుంటాడు.

## నృత్యాలు - నటన

నాగ మయూర నృత్యాలలో భావయుతనటన, భూతనటన అని రెండు రకాల నటన ఉన్నట్లు తెలుస్తుంది. ఇటువంటి నృత్యాలలో శాస్త్రయుక్తంగానూ, భావయుక్తంగాను, భరతనాట్యశాస్త్రం తెలిసినవారు చేసే నటనను భావయుత నటన అంటారు. గ్రామాలలో అమ్మవారి జాతర్లలో, ఉత్సవాలలో స్త్రీ పురుషులు సామూహికంగా నృత్యాలు చేస్తారు. ఆ నృత్యంలో ఒక ఆవేశం ఉంటుంది. అందువల్ల దీనిని భూత నటన అన్నారు పెద్దలు.

## జానపద విజ్ఞానం - కళలు

మానవ సంస్కృతిలో జానపద విజ్ఞానం అంతర్భాగమైంది. ఆ జానపద విజ్ఞానంలో జానపద కళలు ఒక విభాగమయ్యాయి. సంగీతం, నృత్యం, రూపకం జానపదకళలుగా చెప్పబడ్డాయి. అలెన్‌డెండస్, రిచర్ట్ ఎం. డార్సన్, ఆర్.ఎస్.బాగ్స్ మొదలైనవారు ఆచార్య బి.రామారాజు, నాయని కృష్ణకుమారి, ఆర్వీయస్. సుందం మొ॥న వారు జానపద నృత్యకళను జానపద విజ్ఞాన విభాగంలో చేర్చారు. దీనినే ఆంగ్లంలో Folk Dance అంటారు. ఉత్తర భారతదేశంలో లోకనృత్య అని అంటారు. ఈ జానపద నృత్యాన్ని ఏ పేరుతో పిలిచినా అది ఏ ప్రాంతానికి చెందినదైనా దానితో ఆ ప్రాంత ప్రజల ఆచార్య వ్యవహారాలు సంస్కృతి సంప్రదాయాలు చోటుచేసుకుంటాయి.

జానపద నృత్యకళ అతి ప్రాచీనమైనదయినా కూడా కాలానుగుణంగా వచ్చే మార్పులను, చేర్పులను సంతరించుకుంటుంది. కొత్త హంగులను పుణికిపుచ్చుకుంటుంది. కాని మూలరూపం మాత్రం వదిలి పెట్టడం లేదు. అదే జానపద నృత్య సంప్రదాయ లక్షణం.

ఈ నృత్యకళలో మూడు దశలున్నాయి. (1) ఆటవిక దశ (2) జానపద దశ (3) నాగరికదశ

## నృత్య విభజన

జానపద నృత్యాలు వివిధ అంశాలు ఆధారంగా చేసుకొని 6 రకాలుగా విభజించబడ్డాయి.

1. **వ్యష్టి నృత్యాలు :** ఇందులో నామాల సింగని నృత్యం, జ్యోతి నృత్యం, పులివేషం మొదలగునవి ఉన్నాయి.

**2. సమష్టి నృత్యాలు :** వీటినే బృంద నృత్యాలంటారు. వీటిలో కోలాటం, ఉరుములు, కుంచెల నృత్యం, గొరవయ్యల నృత్యం, బీరప్ప డొల్లుల నృత్యం, ఒగ్గుడోలు నృత్యం, తప్పెటగతులు (డప్పు) తప్పెటగుళ్ళు, చెక్క భజన, పండరి భజన, కవ్వాయి కట్టెలు, మజిలీ నృత్యం మొదలగునవి ఉన్నాయి.

**3. కథాసంబంధ నృత్యాలు :** నృత్యం తోపాటు కధాప్రాధాన్యం కూడా కలిగిన నృత్యాలు. వీటిలో ఆసాది కథ, పంబకథ, ఒగ్గుకథ, పిచ్చుకుంట్ల కథ, శారదకథ, బుర్రకథ, బైండ్లకథ, వీరముష్టికథ, దాసరికథ, జంగం కథలు మొదలగునవి ఉన్నాయి.

**4. బొమ్మలాటలు :** బుట్టబొమ్మలాటలు, పెద్దిడి గొల్లలాట మొదలగునవి.

**5. జంతువులాటలు :** ఇవి జంతువులను మచ్చిక చేసి శిక్షణ ఇచ్చి వాటి చేత రకరకాల విన్యాసాలను చేయించే నృత్యాలు. గంగిరెద్దులాట, పాము-ముంగీసాట, ఎలుగుబంటి నృత్యం, గుర్రం నృత్యం, పొట్టేళ్ల వినోదం మొదలగునవి.

**6. స్త్రీల నృత్యాలు :** గొబ్బి నృత్యం, జిక్కి నృత్యం, బతుకమ్మ నృత్యం, బొడ్డెమ్మ నృత్యం మొదలగునవి.

## తప్పెటగుళ్ళు

ఈ తప్పెటగుళ్ళు నృత్యం సమష్టినృత్యం. నృత్యం విశాఖపట్టణం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలో ప్రచారంలో ఉంది. ఇది సంప్రదాయ నృత్యం. గొల్లకులానికి చెందినవారు తప్పెటగుళ్ళు నృత్యం ప్రదర్శిస్తారు. వారికి పశువులు, గొఱ్ఱెలు, మేకలమందలు ఎక్కువగా ఉంటాయి. పశుగ్రాసానికి కూడ కష్టమైనపుడు భగవంతుని కటాక్షం కోసం దేవతలను ఆరాధిస్తారు. ఆ దేవతారాధనలో ఈ నృత్యం ప్రదర్శిస్తారు. ఎక్కువగా విజయనగరం జిల్లా బలిజిపేట మండలంలో జరిగిన ముగుడాలమ్మ జాతరలో ఈ నృత్యం చేస్తారు.

తప్పెటగుళ్ళు కళింగాంధ్ర ఉత్తమ కళారూపంగా వెలుగొందిన జానపద కళారూపం. అది ఈనాడు కనుమరుగవుతూఉంది. అయినా ఈనాడు ఉత్తరాంధ్రలో పల్లె ప్రజలు ఈకళను సంరక్షిస్తున్నారు. ప్రతి సంవత్సరం జరిగే దేవతా కొలుపుల్లోను పండుగ దినాల్లోనూ ఈ నృత్యం ప్రదర్శింపబడుతుంది.

## ప్రదర్శించే విధానం

తప్పెటగుళ్ళు జానపద సంగీత నాట్య దృశ్యరూపకం. రేకుతో గుండ్రంగా తయారుచేసిన తప్పెటలాంటి ఒక వాద్య పరికరాన్ని రొమ్ముపై కట్టుకొని రెండు చేతులతో వివిధ గతులతో ఉధృతంగా వాయిస్తూ, కాళ్ళకు గజ్జెలు కట్టి ఒకేవిధమైన రంగుతో నిక్కర్లతో నాట్యం చేస్తారు. కేకలతో అరుపులతో కేరింతలు కొడుతూ వలయాకారంగా తిరుగుతూ ఒక పద్దతితో అడుగులు

వేస్తూ, వంగుతూ, లేస్తూ, గెంతుతూ, సుదీర్ఘ రాగాలతో ఆలాపన చేస్తూ పాటలు పాడుతూ ప్రేక్షకులను రంజింపచేస్తారు. జట్టు నాయకుడే గురువు. నాయకుని చెప్పుచేతల్లో ప్రదర్శన సాగుతుంది. వారు కేవలం తప్పెటగుళ్ళతో నృత్యం చెయ్యడం మాత్రమే కాక నాయకుడు రామాయణం, భారతం, బొబ్బిలియుద్ధ కథలను చెబుతూ ఉండగా మధ్య మధ్య కొన్ని కీర్తనలు పాడుతారు. లయబద్ధంగా నృత్యం చేసే ఈ బృందాలలో కళాకారులు ఇరవై మంది వరకూ ఉంటారు. వారు ఎంత మందైనా ఉండవచ్చు, కాని సమర్థులై ఉండాలి. తాళం, లయ, తప్పకుండా నృత్యం చెయ్యకలిగి ఉండాలి. క్రమం తప్పకుండా వలయాకారంలో తిరుగుతూ వీరు చేసే నృత్యం కన్నుల పండువుగా ఉంటుంది.

గొల్లసుద్దులను ఆదరించే యాదవులే ఈ కళను ఆదరిస్తారు. ప్రదర్శన స్థాయి పెరిగేకొద్దీ ప్రదర్శకులు ప్రదర్శన మధ్యలో వారి వారి ప్రతిభా విశేషాలను ప్రదర్శిస్తారు. ఒకరి కంటే మరొకరు మిన్నగా రెండు భాగాలుగా విడిపోయి పోటీలు పడతారు. ఒకరి కంటే ఒకరు తప్పెట్ల మీద వాద్యవరుసలు, గమకాలు వినిపిస్తారు. ప్రదర్శనస్థాయి పెరిగే కొద్ది సర్కస్ ఫీట్స్‌లా చేస్తుంటారు. ప్రేక్షకులు ఉత్కంఠతో ఈ సాహస ప్రదర్శనను చూస్తారు.

వారు వలయాకారంగా తిరుగుతూ లయ తప్పకుండా చిందు తొక్కుతూ ఒక పక్క తప్పెట్లు వాయిస్తూ నెమ్మదిగా ఒకరిపై ఒకరు ఎక్కుతూ అంచెలంచెలుగా గోపుర ఆకారంగా నిలిచినపుడు ఆ దృశ్యం ఎంతో అద్భుతంగా ఉంటుంది. పై వారి బరువునంతా కిందివారు భరిస్తూ ఉంటే ప్రక్కనున్న కొద్దిమంది లయ తప్పకుండా పాటలు పాడుతూ ఉంటారు.

## ఏకాగ్రతా నృత్యం

కూచిపూడి నృత్యంలో నెత్తిన చెంబూ కాళ్ళకింద పళ్ళెము మాదిరి, వీరు కూడా నీరు నింపిన మట్టికుండ అంచులపై ఒకరు నిలబడితే అతనిపై మరో వాద్యకారుడు తప్పెటను వాయిస్తూనే నీరునిండిన కుండను నెత్తిన పెట్టుకుని నీరు తొణకకుండా ఒక ప్రక్కన తప్పెట వాయిస్తూ నీరు తొణికి పోతాయేమో అనే దృష్టి లేకుండా నృత్యం చేస్తూ ఉంటే చుట్టూ చేరిన జనసందోహం చప్పట్లు చరుస్తారు.

*(రాధాకృష్ణమూర్తి, మిక్కిలినేని. 2011 : 52,91)*

## గంగమ్మకథ

తప్పెటగుళ్ళు ఆడే కళాకారులు గంగమ్మ కథ చెబుతారు. కాటమరాజు భార్య గంగమ్మ అని, శివుని ఆజ్ఞానుసారంగా పార్వతీదేవే గంగమ్మగా అవతరించిందని యాదవుల నమ్మకం. అందువల్ల వీరు గంగమ్మ తిరునాళ్ళలో ఈ క్రింది పాటను పాడుకుంటారు.

శోభన మోయమ్మ – శోభనమే తల్లి
శోభన మోగంగ – శోభన మోతల్లి

మూడుముళ్ళ నరులమే – మురికి జన్మం మాది
ఎంగిలి కంతానమే మెంచి – పిలువంగలేము
పాచినోరుతోను – పాలింపరేమో యమ్మ
నీకు వందన మమ్మ – లోక మాతవు నీవు
దబ్బ వనములో – దాగుండినావు తల్లీ
నిమ్మ వనములోన – నిలిచివున్నావుతల్లీ
నీకు వందన మమ్మ – లోకమాతవు నీవు అని గంగను ప్రార్థిస్తారు.

*(రాధాకృష్ణమూర్తి, మిక్కిలినేని. 2011 : 529)*

ఈ ప్రదర్శన ఎంతో కట్టుబాటుతో నడుస్తుంది. వారి ప్రదర్శన వరుస క్రమంలో ఏ మాత్రం పొరపాటు జరిగినా అవమానంగా భావిస్తారు. అందువల్లే వారి ప్రదర్శన మొదట నుండి చివర వరకు ఎంతో ఆసక్తికరంగా నడుస్తుంది.

## వివిధ విన్యాసాలు

వీరు లయానుగుణంగా అనేక పాటలు పాడుతారు. భక్తిగేయాలు, దశావతారాలు, కృష్ణలీలలు, సారంగధర చరిత్ర, చెంచీత అమ్మవారి చరిత్రలాంటి కథాగేయాలను కూడా పాడుతూ సన్నివేశానికి తగినట్లు అభినయాలను ప్రదర్శిస్తారు. వారి ప్రతిభను తెలియజేసే విన్యాసాలను చేస్తారు.

వివిధ భంగిమల్లో తప్పెట్లు వాయించడమే కాక, ఒకరి మీద మరొకరు ఎక్కి రెండువైపులా ఇద్దరు వేలాడుతూ తప్పెటలు వాయించడం రెండు జట్లుగా విడి పోయి తప్పెటగుళ్ళు వాయిస్తూ వారి ప్రతిభను ప్రదర్శిస్తారు. అంతేగాక ఒక కుండపైన ఒకరు నిలబడి అతనిపైన మరొకరు నిలబడి తప్పెట గుళ్ళు వాయిస్తారు. విన్యాసాలలో ఎగిరి కిందపడడం, మోకాళ్ళమీద కూర్చుని విన్యాసంగా గుళ్ళు వాయించడం వంటివి చేస్తారు. ఈ విధంగా ఈ ప్రదర్శన నాలుగైదు గంటలు సాగుతుంది. వీరు పగటిపూట తమ వృత్తి చూసుకుంటారు. రాత్రిపూట శిక్షణ పొందుతారు. వారి పిల్లలకు చిన్నతనం నుండే ఈ నృత్యంలో శిక్షణ ఇస్తారు. నృత్యం పురుషులు మాత్రమే చేస్తారు. జాతీయ ఉత్సవాలలోను, విదేశాలలోను ప్రదర్శింపబడినట్లు మిక్కిలినేని రాథకృష్ణమూర్తిగారు తెలుగువారి జానపదకళా రూపాలలో తెలియజేశారు.

*(రాధాకృష్ణమూర్తి, మిక్కిలినేని. 2011 : 531)*

## తప్పెటగుళ్ళు – అభినయ విన్యాసం

తప్పెటగుళ్ళు నృత్యాన్ని ఎక్కువగా జాతరల్లోనే ప్రదర్శిస్తారు. ఈ ప్రదర్శనంతా అభినయ విన్యాసాలతో తొణికిసలాడుతుంది. పాటకుతగిన తాళం, తాళానికి తగిన లయ, లయకు తగిన నృత్యం చేస్తూ పాట పాడుతూ ఉన్నప్పుడు ముఖంలో ఉత్సాహ ఉద్రేకాలతో కూడిన

సాత్విక భావన కొట్టవచ్చినట్లు కనబడుతుంది. తప్పెటగుళ్ళు ఏ గ్రామంలో ప్రదర్శించాలో ముందుగా నిర్ణయించుకొంటారు. గ్రామపెద్దల దగ్గర ముందుగా పావలా డబ్బుల తోపాటు కొంచెం బెల్లం కూడా బిజానాగా ఇచ్చి ఏ తేదీన నృత్యం ప్రదర్శించాలో నిర్ణయించుకుంటారు.

## సజీవకళ

విజయనగరం జిల్లాలోని గజపతినగరం తాలూకా, పల్లపేట, మురిపల్లె గ్రామాలలో ఈ నృత్యం సజీవంగా ఉన్నట్లు తెలుస్తుంది. పెల్లా చిననారాయణ, దుర్గ చినఅప్పలస్వామి నాయకత్వాన గజపతినగరం వృత్తి కళాకారుల సమాఖ్య సహకారంతో ఈ నృత్యం ప్రదర్శింపబడుతుంది.

ఈ కళకు గుర్తింపు కావాలని డా.బి.యస్.ఆర్.మూర్తి దంపతులు ఎంతో కృషి చేశారు. గజపతినగరం చుట్టుపక్కల నలభై గ్రామాలలో తప్పెట గుళ్ళు నృత్యం నేర్చుకున్న దళాలున్నాయి. శ్రీకాకుళం జిల్లాలోని షేరు మహమ్మదు పురంలో కోన చినవాడు అనే వ్యక్తి ఆధ్వర్యంలో ఈప్రదర్శనలు జరిగినట్లు తెలుస్తుంది. ఆ తరువాత కోరాడ పోతప్పడు అనే వ్యక్తి ప్రదర్శనకు బాధ్యత వహించినట్లు తెలుస్తుంది.

*(రాధాకృష్ణమూర్తి, మిక్కిలినేని. 2011 : 531)*

2011 సం॥లో జీ తెలుగు అనే టి.వి.ఛానల్‌లో "అద్భుతం" అనే ప్రోగ్రామ్ నిర్వహించ బడింది. దానిలో ఈ తప్పెటగుళ్ళు నృత్యం ప్రదర్శించారు. వీరు శ్రీకాకుళం జిల్లాకి చెందిన వ్యక్తులు. ఈ విధంగా టి.వి ఛానల్ వారు జానపద సాహిత్యానికి సంబంధించిన పాటలు, జానపద విజ్ఞానానికి సంబంధించిన కళారూపాలను ప్రసారం చేయడం వలన ఆ కళలు తెలియనివారికి వాటి గురించి తెలిసే అవకాశం ఉంటుంది.

## తప్పెటగుళ్ళు - పరిరక్షణ

1. తప్పెటగుళ్ళు ప్రదర్శింపబడుతున్న గ్రామాలకు వెళ్ళి ఆడియో, వీడియోల ద్వారా రికార్డు చేసుకొని భద్రపరచుకొని ఈ కళను కాపాడుకోవాలి.
2. ఈ కళాకారులతో గ్రామాలలో ప్రదర్శన లిప్పించాలి. ఈ విధంగా చేయడం వలన కళలు అంతరించిపోకుండా సజీవంగా ఉంటాయి.
3. గ్రామాధికారులు ఈ కళల విలువ ప్రజలకు తెలియజేయాలి. ప్రతి పండుగకు ప్రదర్శన లిప్పించి కళాకారులకు ఆర్థిక సహాయం అందజేయాలి.
4. ప్రభుత్వం వృద్ధులైన కళాకారులకు ప్రతినెలా ఫించను ఇవ్వడం లాంటి కార్యక్రమాలు చేపట్టాలి.

5. జాతీయ ఉత్సవాలలో, సదస్సులలో ఆ కళాకారులను పిలిచి ప్రదర్శన లిప్పించి ఆర్థిక సహాయం చేయాలి. ఈ విధంగా చేయడం వల్ల తెలియనివారికి కూడ ఈ నృత్యం తెలుస్తుంది. కళాకారులకు కూడా ప్రోత్సాహకరంగా ఉంటుంది.
6. ఆధునిక సమస్యలయిన మద్యపానం బాల్యవివాహాలు వంటి వాటిని రూపుమాపడానికి పాటలు కట్టి వాటి ద్వారా ప్రచారం చేయిస్తే జానపద సమాజానికి మేలు కలుగుతుంది.
7. విశ్వవిద్యాలయాలలో ఈ జానపద కళలు ప్రదర్శించడం వల్ల విద్యార్థులకు ఉన్న ఒత్తిడి తగ్గి మానసికంగా ఉత్సాహం, ఉల్లాసం కలుగుతుంది.

జానపదాంశాలపై పరిశోధన చేసే విద్యార్థులు క్షేత్ర పర్యటన చేసి ఆయా అంశాలను సేకరించాలి. జానపద సాహిత్యాన్ని జానపద కళలను కాపాడవలసిన బాధ్యత మనందరికి ఉంది.

**ఉపయుక్త గ్రంథాలు**


1. కృష్ణకుమారి, నాయిని. 2017. తెలుగు జానపద గేయగాథలు. తెలుగు అకాడమి, హైదరాబాదు.
2. జోగారావు, యస్వీ. 1961. యక్షగాన వాఙ్మయ చరిత్ర. ఆంధ్రవిశ్వ కళాపరిషత్ప్రకాశికము.
3. రాధాకృష్ణమూర్తి, మిక్కిలినేని. 2011. తెలుగువారి జానపదకళారుపాలు. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు.
4. సుందరం, ఆర్.వి.యస్. 2014. ఆంధ్రుల జానపదవిజ్ఞానం. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు.
5. ముగుడాలమ్మ జాతర. 2011. మే 10, 11 బలిజిపేట, విజయనగరం జిల్లా.




(జానపద విజ్ఞానం–పరిరక్షణ. జాతీయ సదస్సు. మార్చి 22, 23, 2013.
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం,
హైదరాబాదు).

# 7. యక్షగానాలు - వస్తు వైవిధ్యం

'**య**క్షగానం' ఆంధ్రజాతీయ రూపక ప్రక్రియ. 'యక్షగానం' అంటే యక్షులపాట అని సామాన్యార్థంలో చెప్పవచ్చు. యక్షుల గుఱించి ప్రాచీన హైందవ, బౌద్ధ సారస్వతాలలో ఎక్కువగా చెప్పబడింది. గృహ్య సూత్రాలలో భూతాదులతోపాటు యక్షవాహనం కూడ కన్పిస్తుంది. శాంఖాయన గృహ్య సూత్రంలో యక్షాధిపులలో ఒకడైన మాణిభద్రుడు గురించి ప్రస్తావించినట్లు తెలుస్తుంది. బౌద్ధసారస్వతంలో "యక్షులు" నీతి ప్రవక్తలుగాను, రక్షక శక్తులుగాను చెప్పబడ్డారు. బౌద్ధశిల్పాలను పరిశీలించినట్లైతే వానిలో యక్ష యక్షిణీ ప్రతిమలు మనకు కనిపిస్తాయి. వారికి నాగ, గంధర్వ, కిన్నెర మొదలైన వారితో సంబంధమున్నట్లు తెలుస్తుంది. డాక్టరు కుమారస్వామి గారు యక్షులు కామరూపులని, దయాళువులు రక్షణచణులైన రణశూరులు అని తెలియజేశారు. వాల్మీకి రామాయణంలో యక్షత్వమనేది అమరత్వంతోపాటు ఒక దివ్య వరప్రసాదం లాంటిదని చెప్పబడింది. మహాభారతంలో రాజసగుణ ప్రధానులైన మానవులు యక్షరాక్షసులను కొలుస్తారని చెప్పబడింది. అందులో యక్షప్రశ్నల ఘట్టాన్ని పరిశీలించినట్లైతే యక్షులు ధర్మ పరాయణులు లేక జిజ్ఞాస కలవారని తెలుస్తుంది. 'శ్రీవి.ఆర్.ఆర్ దీక్షితారు గారు రాసిన "రామాయణమున దక్షిణ హిందూదేశ" మనే వ్యాసంలో రాక్షసులకు ముందు సింహళదేశంలో యక్షులు రాజ్యాన్ని పరిపాలించేవారని బలిచక్రవర్తిసేనాని అయిన సుమాలి యక్షుల నోడించి, రాక్షస రాజ్యాన్ని స్థాపించినట్లు ఒక గాథ ఉందని చెబుతూ యక్షజాతి రాక్షస జాతులలోని ఒక పాయ అని రాక్షసులరాజ్యం అంతరించిన తరువాత యక్షులు అక్కడ మరల రాజ్యస్థాపన చేశారని ఉంది. "మహావంశ" మనే గ్రంథంలో ప్రకాశం క్రీ.పూ. 5వ శతాబ్దం వరకు సింహళ దేశంలో యక్షుల రాచఱికం ఉన్నట్లు రాశారు. యక్షులు అక్షస్ (Oxus) నదీ ప్రాంతం వారు గాని లేక యఛీ (Yuchi) అను మంగోలి జాతివారు లేక జక్షార్తీసే (Jaxartes) ప్రాంతం వారుగాని అయి ఉంటారని కొన్ని అభిప్రాయా లున్నట్లు తెలుస్తుంది'.

*(జోగారావు, యస్వీ. 1961 :6)*

'కన్నడ కవి అభినవ పంపడు (12వ శతాబ్దానికి చెందిన వాడు ఆయన రాసిన మల్లినాథపురాణంలో యక్షాందోళనమనే నాట్యం గురించి ప్రస్తావించినట్లు తెలుస్తుంది. కన్నడ

యక్షగాన నాట్య ప్రదర్శనలలో "యక్షిణీ వేషం" ఈ అందోళికా నాట్యాన్ని నేటికి ప్రదర్శిస్తున్నారు'. ఆంధ్రదేశంలో జక్కుల ప్రసక్తి చిరకాలం నుండి ఉన్నట్లు తెలుస్తుంది. ఈనాడు రాయలసీమలో జక్కసాని కుంట్ల (కర్నూలు జిల్లా, పత్తికొండ తాలూకా) జక్కల చెఱువు (పెనుగొండ తాలుకా) జక్కసముద్రము (హిందూపురం తాలుకా) జక్కు లాడికి (బళ్ళారిజిల్లా) మొదలైన గ్రామాల పేర్లున్నాయి. ఈ ఆధారాల వల్ల ప్రాచీన కాలం నుండి ఆయా ప్రాంతాలలో జక్కుల జాతి ఉన్నట్లు తెలుస్తుంది'.

(*జోగారావు, యస్వీ. 1961 :* 9,18)

ద్రవిడ దేశ దృశ్య ప్రబంధాలలో గల కొఱవంజిలేక కురవంజి నుండి యక్షగానం వచ్చిందని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సుగ్రీవ విజయం పీఠికలో తెలియజేశారు.

'ద్రావిడ భాషలలో మొదట వచ్చిన దృశ్యరచనలు కురవంజి కథలు. ఆంధ్ర, కర్ణాటక, ద్రావిడదేశపు అరణ్యాలలో చెంచులు, కురవలు, క్రోవ, కోయ మొదలైన వారు నివసిస్తున్నారు. అందులో వారి అంజె అనగా అడుగు నృత్య విశేషాన్ని కురవంజె అని అంటారు. చిందు, గంతు, గొండ్లి, అంజె, అంగ మొదలగునవి నృత్యవిశేషాలు.

శ్రీశైలం, ఇంద్రకీలాద్రి, వేదాద్రి మంగళాద్రి మొదలైన పర్వతాల మీద వర్షోత్సవాలు (యాత్రలు, జాతరలు) జరిగేవి. ఆ సమయంలో అక్కడికి నాగరిక ప్రజలు చేరుకునేవారు. వారి వినోదం కోసం అక్కడి ఆటవికులు నృత్య ప్రదర్శనలు చేసి ధనార్జన చేసేవారు. అక్కడి కొరవజాతివారు చేసే నృత్యం కొరవంజెగా పిలువబడింది. కిరాతార్జునీయం, నృసింహస్వామి చెంచేతను పెండ్లాడం మొదలగునవి కురవంజులు.

*(జోగారావు, యస్వీ. 1961 : 31, 32)*

శివరాత్రి ఉత్సవాలలో బొమ్మలాటలను శ్రీశైలంలో ప్రదర్శించే వారని పాల్కురికి సోమనాధుడు పండితారాధ్య చరిత్రలో ఉంది. తోలుబొమ్మలాట కొయ్యబొమ్మలాటలే యక్షగానంగా పరిణామం చెందాయని, కాల క్రమేణా బొమ్మలకు బదులు మనుషులు ప్రదర్శలిస్తూన్నారనే అభిప్రాయం పండితులలో ఉంది.

## యక్షగానం - వస్తువైవిధ్యం

స్థూలంగా యక్షగానాలలోని వస్తువు పౌరాణికాలుగా భావిస్తారు. కాని పరిశీలన చేసినట్లైతే వస్తువైవిధ్యం కనిపిస్తుంది. దీన్ని దృష్టిలో ఉంచుకొని యక్షగానాన్ని నాలుగు ప్రధాన భాగాలుగా విభజించవచ్చు. (1) పౌరాణికాలు (2) చారిత్రకాలు (3) సాంఘికాలు (4) కాల్పనికాలు

## 1. పౌరాణికాలు

పౌరాణికాలలో మరల రామాయణేతివృత్తాలు, భారతేతివృత్తాలు, భాగవత ఇతివృత్తాలు, వ్రతకథలు, పతివ్రతల కథలు పేరంటాళ్ళు, క్షేత్రమహాత్మ్యాలు ఉంటాయి. మతపరంగా చూసినట్లైతే శైవ సంబంధమైనవి. వైష్ణవ సంబంధమైనవి రెండు వేరుగా కనబడుతున్నాయి. ఈ బేధం యక్షగాన కళాకారులలో లేదు. మాలదాసరుల ప్రదర్శనంలో వైష్ణవపరమైన ఇతి వృత్తాలు ఎక్కువగా కనబడుతాయి. బుడగ జంగాల ప్రదర్శనలలో శైవపరమైన ఇతి వృత్తాలు ఎక్కువగా ఉంటాయి.

ఎ. **రామాయణేతివృత్తాలు :** సత్యహరిశ్చంద్ర, సీతాస్వయంవరం, కుశలవచరిత్ర, సతీసులోచన, సుగ్రీవవిజయం, హనుమద్విజయం, శ్రీరామపట్టాభిషేకం, రామరావణ యుద్ధం, భూకైలాస్, కౌసల్యా పరిణయం, కూచకొండ రామాయణం, సుందరకాండ పరశురామ విజయం మొదలగునవి.

బి. **భారతేతివృత్తాలు :** భారతంలోని అనేక విషయాలు, యక్షగానాలుగా వెలువడ్డాయి. శ్రీకృష్ణరాయభారం, శ్రీకృష్ణతులాభారం, గయోపాఖ్యానం+సుభద్రా పరిణయం, నలమహారాజు చరిత్ర, శశిరేఖాపరిణయం. ఒక హిడింబాసురవధ, దేవయాని చరిత్ర, కీచక వధ, శాకుంతలా పరిణయం. పద్మవ్యూహం, బభ్రువాహన చరిత్ర, గజగౌరీవ్రతం, కుంతీదేవి సాహసం, ఉత్తర గోగ్రహణం, జరాసంధవధ, కిరాతార్జునీయం, శ్రీకృష్ణపారిజాతం, మాయాసుభద్ర, సైంధవ పరాభవం ద్రౌపదీ స్వయంవరం, భీమసేన విలాసం, సౌమిత్రి పరిణయం మొదలైనవి.

సి. **భాగవతేతివృత్తాలు :** కృష్ణ మోహినీ విలాసము, వీరభద్ర విజయము, మాంధాత చరిత్ర, తారాశశాంక విజయము. కృష్ణపారిజాతము, సత్యభామా పరిణయం. నరకాసురవధ, భక్తప్రహ్లాద, మార్కేండేయ విలాసము, రుక్మిణీ కల్యాణము, కాళింగ మర్ధనము, సతీతులసి మొదలగునవి.

డి. **వ్రత కథలు :** తులసీ వ్రతం, గజగౌరీ వ్రతం, సత్యనారాయణ వ్రతం.

ఇ. **పతివ్రతల కథలు :** పేరంటాళ్ళ కథలు, సతీ తులసి, సతీ అనసూయ, సతీ సుమతి, కామమ్మ కథ, లక్ష్మమ్మ కథ మొదలగునవి.

## 2. చారిత్రకాలు

వాస్తవగాథలు అనంతరకాలంలో ప్రచారంలోకి వస్తాయి. అవే వీరగాథలు. మహా పురుషుల జీవిత చరిత్రలు, భక్తుల చరిత్రలు, పేరంటాళ్ల కథలు మొదలైన ఇతివృత్తాలతో వచ్చిన యక్ష గానాన్ని చారిత్రక యక్షగానాలనవచ్చు. ఉదా : పుండరీక చరిత్ర, భక్తరామదాసు

చరిత్ర, పెద్ద బొబ్బిలి చరిత్ర, సారంగధర చరిత్ర, శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారి చరిత్ర మొదలైనవి. బొబ్బిలి కథ బుర్రకథగాను, శారదకథగాను కూడా ప్రచారంలో ఉంది.

**భక్తుల చరిత్రలు**

మార్కండేయ విలాసము, పుండరీక చరిత్రము, ప్రహ్లాద చరిత్రము, చిరుతొండనంబి కథ, రామదాసు చరిత్రము మొదలైనవిగా ప్రచారంలో ఉన్నాయి.

**3. సాంఘికాలు**

ఇందులో సామాజికాంశాలు ఉంటాయి. సాంఘిక జీవన సమస్యలు ప్రధానంగా తీసుకొని రచించిన ఈ రచనలను సాంఘిక యక్షగానాలుగా చెప్పవచ్చు. ఉదా : క్రోధాపురి రైతు విజయం. ఇది వీధినాటకమైనప్పటికి, యక్షగాన లక్షణాలు కూడా ఉన్నాయి.

**కాల్పనికాలు :** కాల్పనికాంశాలు పౌరాణికాల్లోను, చారిత్రకాల్లోను, సాంఘికాల్లోను కనబడు తుంటాయి. అన్నిటిలోను కల్పనంటే దేశం, కాలం, నామం, ఇతివృత్తం, సంఘటనలు మొదలైన ఉంటాయి. ఒక్కొక్కసారి ఊహకందని విషయాలు కూడా కల్పించబడతాయి. జానపద సాహిత్యంలో కాల్పనికాలు అధికంగా ఉంటాయి. ఉదా : "జయంత జయపాలము" అనే కల్పిత యక్షగానాన్ని శ్రీ చెర్విరాల భాగయ్య రచించారు. అల్లిరాణికథ, కనతార చరిత్రము, కాంతమణి చరిత్ర, గులేబకావళికథ, కలియుగ పొన్నకథ, మొదలైనవి.

కాల్పనికాలు కాంభోజరాజుకథ, అరెమరాఠీల కథ మొదలగునవి కూడ కల్పనలే అని కొందరి అభిప్రాయం.

**క్షేత్రమాహాత్మ్యాలు :** క్షేత్ర మాహాత్మ్యాన్ని తెలియజేసే యక్షగానాలు ఉన్నాయి. ఉదా : యాదగిరి నరసింహ, సింహాద్రి అప్పన్న, శ్రీశైలం మల్లన్న, మన్నెంకొండ వెంకన్న మొదలగునవి. ఈవిధంగా యక్షగానాలలో కథ కల్పితం కావడం. ఏదో ఒక అంశం కల్పితం కావడం, సర్వసాధారణం, దేశనామాలు, గ్రామనామాలతోబాటు, కొన్ని సంఘటనలు కూడా కల్పించ బడతాయి. అంగవంగ, కళింగ, కాశ్మీర, బర్బర మొదలైన దేశాలపేర్లు కల్పితాలుగా తెలుస్తుంది. కలియుగ పొన్న కథలో రచయిత తమ గ్రామమైన ధర్మారాన్ని ధర్మపురిగా చెప్పినట్లు తెలుస్తుంది. యక్ష గానాలలో వ్యక్తి నామాలుకూడా కల్పించబడినట్లు తెలుస్తుంది. "పాశన చోళరాజు, మౌత్తుడాంగేయుడు, వాలీసుమేలీసులు, దీర్ఘరాయుడు, నవవల్లి యోగి మొదలైన నామాలు ఉన్నాయి. జన వ్యవహారంలోను, పురాణాల్లోను చారిత్రక గ్రంథాల్లోను కూడా కనబడని కల్పిత నామాలు ఉన్నాయి.

ఈ విధంగా యక్షగానాలలో అనేక కొత్త అంశాలున్నాయి. యక్షగానాలు వస్తువైవిధ్యం అనే అంశంపై సమగ్రమైన పరిశోధన జరగాల్సిన ఆవశ్యకత ఉంది.

## ఉపయుక్త గ్రంథాలు

1. ఎల్లారెడ్డి, పొద్దుటూరి. 1994. తెలంగాణలో యక్షగాన రచన-ప్రయోగం. జాతీయ సాహిత్య పరిషత్.

2. జోగారావు, యస్వీ. 1961. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర. ఆంధ్రవిశ్వకళాపరిషత్ప్రకాశికము.

3. రాధాకృష్ణమూర్తి, మిక్కిలినేని. 2011. తెలుగువారి జానపద కళారూపాలు. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్.

4. శ్రీకాంత్ కుమార్, వెలురంగప్ప. 2015. తెలంగాణ యక్షగాన వాఙ్మయము : తెలంగాణా జాగృతి, హైదరాబాదు.



(ఆంధ్ర విశ్వవిద్యాలయం తెలుగు విభాగం (జాతీయ సదస్సు. జులై 29, 2011)
*(వ్యాస పద్మాలు (ప్రధాన సంపాదకులు. కె.వి. పద్మావతి.*
*రోషన్ పబ్లికేషన్ 2018. విశాఖపట్టణం)*

# 8. బాలకృష్ణ నాటకం (యక్షగానం) - విశ్లేషణ

## రచయిత్రి పరిచయం

**త**రిగొండ వెంగమాంబ క్రీ.శ. 1730లో చిత్తూరు జిల్లాలోని తరిగొండ అనే గ్రామంలో జన్మించింది. ఈ గ్రామంలో ప్రసిద్ధి చెందిన లక్ష్మీ నృసింహస్వామి దేవాలయం ఉంది. తరిగొండ అంటేనే నృసింహస్వామి అని అర్థం. పూర్వం పెరుగు చిలికే కుండలో సాలగ్రామ శిలారూపంలో లక్ష్మీ నృసింహస్వామి అవతరించాడు. అందువల్ల ఆ ఊరిపేరు "తరికుండ"గా ప్రఖ్యాతి గాంచింది. కాలక్రమేణ 'తరిగుండ'గా మారి చివరకు తరిగొండ అనే పేరు స్థిరపడింది. కనుక 'తరిగొండ' అనగా పెరుగు చిలికే కుండలో వెలసిన నృసింహుడు అని అర్థం. కవయిత్రి తల్లిదండ్రులు కానాల మంగమాంబ, కృష్ణయామాత్యుడు. వీరిది నందవరశాఖ, వశిష్ఠ గోత్రం. వీరు సంతానం కోసం తిరుపతి యాత్ర చేస్తారు. ఆ తరువాత వీరికి కూతురు జన్మిస్తుంది. వేంకటేశ్వరస్వామి వరప్రసాదం వల్ల కూతురు జన్మించింది, కాబట్టి వెంగమాంబ అని పేరు పెడతారు.

వెంగమాంబకు చిన్నతనం నుండే దైవభక్తి మెండు. కాలక్రమేణ ఆ భక్తి పెరిగి భక్తి పరవశతతో తాత్త్వికమైన ధ్యాసతోను మైమరచిపోతు, పాటలు పాడుతు వీధుల్లో నృత్యం చేస్తుండేది. ఇరుగు పొరుగు వారు ఆమెది ఉన్మాదస్థితి అని ప్రచారం చేస్తారు. అందువల్ల తల్లిదండ్రులు ఆమెకు బాల్యంలోనే వివాహం చేస్తారు. చిత్తూరు దగ్గర నారగుంట పాళెంలో నివాసముంటున్న శ్రీవత్స గోత్రీకుడైన తిమ్మయార్యుని కుమారుడైన వేంకటాచలపతి ఆమె భర్త. వివాహమైన కొన్నాళ్లకే అతడు మరణిస్తాడు. ఈ సంఘటనతో ఆమెలో వైరాగ్యభావం మరింత పెరుగుతుంది. అప్పుడామె తండ్రి మదనపల్లిలో ఉన్న గొప్ప వేదాంతి రాజయోగి అయిన రూపావతారం కృష్ణమాచార్యులు వద్ద ఆమెకు బ్రహ్మవిద్యోపదేశం చేయిస్తాడు. వెంగమాంబ గురువుగారి వద్ద అష్టాంగ యోగవిధానాన్ని, మంత్రోపదేశాన్ని స్వీకరించి యోగవిద్యలో సాధన చేసి యోగిని అవుతుంది.

ఒకరోజు వెంగమాంబ యోగాభ్యాసాన్ని పూర్తిచేసి అలసటతో ఆకాశం వైపు చూస్తుండగా ఏవో కొన్ని అక్షరాల పంక్తులు ప్రకాశిస్తూ దిగివచ్చి ఆమె ముఖంలో ప్రవేశించాయట. ఈ

విషయం కవయిత్రి తిరుమల క్షేత్రంలో శ్రీ వెంకటాచలమాహాత్మ్యం అనే పద్యకావ్యం అవతారికలో ఇష్టదేవతా ప్రార్థనలో రెండు పద్యాలలో స్పష్టంగా పేర్కొన్నట్టు ఈ యక్షగానం పీఠికలో ఉంది. ఆమె తరిగొండలో ఉన్నప్పుడు 1. తరిగొండ నృసింహ శతకము 2. రాజయోగామృతసారము (ద్విపద కావ్యము) 3. నృసింహ విలాసకథ (యక్షగానము) 4. శివనాటకము (యక్షగానము) 5. బాలకృష్ణ నాటకము అనే వాటిని రచించింది.

వెంగమాంబ సమాజం దృష్టిలో వితంతువైనా, భగవంతుడే నాపతి అని సువాసినిగా జీవిస్తుంది. అందువల్ల పుష్పగిరి పిఠాధిపతి ఆ ఊరికి వచ్చినపుడు సభ ఏర్పాటుచేసి ఆమెను ప్రశ్నిస్తాడు. ఆమె తపశ్శక్తిని ప్రత్యక్షంగా తెలిసికొంటాడు. ఆమె ప్రహ్లాదుని అంశతో జన్మించిన నృసింహ ఉపాసకురాలని కొనియాడతాడు. ఆ ఊరి సంప్రదాయవాదులను మందలించి వెళతాడు. ఆ తరువాత వెంగమాంబ తరిగొండ నృసింహుని ఆలయంలోనే ఉంటుంది. ఒకరోజు ఆమె ఆ దేవాలయంలోని ఆంజనేయస్వామి విగ్రహం వెనుక ధ్యానంతో నిమగ్నమై ఉన్నప్పుడు అర్చకుడు ఆమె జుట్టు పట్టుకొని లాగుతాడు. అపుడామె తన ధ్యానం భగ్నమైనా సరే అతనిని ఏమి అనకుండా అడవి మార్గం ద్వారా తిరుమలకు వెళుతుంది. ఆమె గురించి తెలుసుకొన్న హథీరాంజీ మఠాధిపతి అయిన మహంతు ఆమెకు వసతి ఏర్పాటు చేస్తాడు.

ఆ తరువాత వెంగమాంబ గురించి తెలుసుకున్న అన్నమాచార్యుల వంశీయులు తిరుమలలోని మాడవీథిలో గల తమ ఇంటిలో చిన్న భాగాన్ని ఆమెకు ఇస్తారు. తిరుమలలోని ఆమె నివాసానికి ఒకవైపు తాళ్ళపాకవారు మరోవైపు అక్కారాం వెంకటరామ దీక్షితులనే అర్చకుల పెద్ద నివసించేవారు ఆ అర్చకుడు మాటలతో ఆమె మనస్సు నొప్పిస్తుండేవాడు. అపుడామె తన అంతరాత్మ ప్రేరణతో తుంబుకోనకు చేరుకొని ఒక కొండగుహలో ఉండి ఆరేళ్ళు తీవ్రమైన తపస్సు చేస్తుంది. ఆ తరువాత మహంతు అభ్యర్థన ప్రకారం ఉత్తరమాడ వీథిలో ఎత్తైన ప్రదేశంలో పూలతోటను నిర్మించుకొని నివాసముంటూ ఈ కొన్ని రచనలు చేస్తుంది. అవి :

### యక్షగానాలు

1. విష్ణు పారిజాతము 2. చెంచు నాటకము 3. రుక్మిణీనాటకము 4. గోపికానాటకము 5. జలక్రీడ విలాసము 6. ముక్తికాంతా విలాసము.

### పద్యకావ్యాలు

1. రమా పరిణయము ద్విపద కావ్యము 2. శ్రీ వేంకటేశ్వర కృష్ణమంజరి (స్తుతికావ్యం), 3. శ్రీ భాగవతము (ద్విపద కావ్యము) 4. శ్రీ వేంకటాచల మహాత్మ్యము (పద్యకావ్యము) 5. అష్టాంగసారము (తాత్వికమగు పద్యకావ్యము) 6. తత్త్వకీర్తనలు వెంగమాంబ తన రచనలన్నిటిని తరిగొండ నృసింహస్వామికి వేంకటేశ్వరస్వామికి అంకిత మిచ్చింది.

క్రీ.శ. 1817లో వెంగమాంబ ఈశ్వర శ్రావణ శుద్ధ నవమినాడు సజీవసమాధి పొంది శ్రీవేంకటేశ్వరస్వామిలో ఐక్యమైనట్లు ప్రచారంలో ఉంది.

## యక్షగాన రచనల పరిచయం

దేశి సాహిత్యంలోని అత్యంత విశిష్టమైన ప్రక్రియ యక్షగానం, యక్షుల యొక్క గాన పద్ధతియే యక్షగానం. యక్షులు గంధర్వ, విద్యాధరాదులవలె దేవయోనులు. అనగా దేవతల వల్ల జన్మించినవాళ్ళు (Demigods). యక్షులకు రాజు కుబేరుడు. అతడు ధనాధిపుడు అంటే ధనానికి అధిపతి. అతడు ధనదుడు (ధనాన్ని ఇచ్చేవాడు) కూడ. సృష్టియందలి సమస్త సంపదలకు అధిపతియైన శ్రీ మహాలక్ష్మి యక్షజాతి కంతటికి కులదేవత

*(బాలకృష్ణ నాటకము పీఠిక :15)*

ప్రాచీనకాలంలో యక్షజాతికి చెందిన కొందరు అతి ప్రాచీన కాలం నుండి దక్షిణ హిందూదేశంలోను, సింహళ ద్వీపంలోను నివసించారని, తమ విచిత్ర వేషధారణతో, గానంతో ప్రజలను ఆకర్షించి ఉంటారని పరిశోధకులు భావిస్తున్నారు. వీరు ఆంధ్రప్రదేశ్‌లో ప్రాచీనకాలం నుండి నివసించే వారని, వారి కులదేవత కామవల్లీ మహాలక్ష్మి అని, ఆమెకు ఆదిలక్ష్మీకామేశ్వరి అని వేరొక పేరుందని, ఆ దేవతను ఆరాధించడానికి పరమశివుడు ఇద్దరు యక్షులను ఆజ్ఞాపించాడని, వారిరువురికి జన్మించిన వారే జక్కుల వాళ్ళు అని ఐతిహ్యం. బాలకృష్ణ నాటకంలోని ఈ క్రింది పంక్తుల వల్ల ఆవిషయం వ్యక్తమవుతుంది.

కామవల్లియు చిన్ని కన్యరూపమున
కామారి కప్పు డాకరంబు చూపె
చూపిన ముదమంది సురల రా బనిచి
యా పార్వతీశ్వరుండతి సంభ్రమమున
ఇరవొప్ప యక్షుల నిద్దిర బిలిచి
మురువొప్ప జక్కుల ముద్రలు చేసి
ఉరుమలు, మద్దలల్ ఉపకరణములు
కరమొప్ప తగినవి గావించి ఇచ్చి
ముత్యాల రంగముల్ మున్నూరు చేసి
అత్యంత ముదముతో నడిగిన వేళ
చిందెముల్ బోనముల్ శృంగారములును
అందముల్ పరికెలు ఆనందములును
ఆరీతి సంతసమందగా జేసి
సారెకు ముద్రల జక్కుల బిలిచి

రమణ మీ వంశ పారంపర్యమెల్ల
కమలాక్షి గొలువుడీ కామవల్లెమను
కామవల్లిని గొల్చు ఘనులెల్ల మున్నె
ప్రేమతో మిము చాల ప్రియము జేసెదరు
పొందని వీడ్కొల్ప పూబోణులందు
దండిగా వారలిద్దరు తోడురాగ
తేకువ కనకావతీపురం బపుడు
ఏకచిత్తంబున నేలుచునుండె

*(బాలకృష్ణ నాటకము : 37)*

ఈ జక్కుల కోవకు చెందినవారే కన్నడ దేశపు ఎక్కలగాణలు. వీరి ప్రసక్తి కన్నడ సాహిత్యంలో అభినవ పంపడు అనే బిరుదు గల నాగచంద్రుడనే కవి రచించిన మల్లినాథ పురాణంలో ఉంది. ఈ తరువాత జక్కులపాటల బాణీలో మరికొన్ని పౌరాణిక గాథలు, క్షేత్రమాహాత్మ్యాలు అజ్ఞాత జానపదకవులు పాడేవారని అవి ప్రచారం ద్వారా పండితులను ఆకర్షించాయని, ఈ విధంగా జక్కులపాటలు విద్వత్కవుల దృష్టిని ఆకర్షించడం వల్ల యక్షగానమనే పేరు వచ్చిందని తెలుస్తుంది.

కీర్తంతు రెడ్డాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్షగానసరణి

*(భీమఖండము : 3-65)*

అని శ్రీనాథుడు పేర్కోడం ద్వారా తెలుగులో 14వ శతాబ్దం నుండి యక్షగానాలు రచింపబడినట్లు తెలుస్తుంది. 15వ శతాబ్దంలోని రెండు యక్షగానాలు ప్రోలుగంటి చెన్నశౌరి రచించిన సౌభరిచరిత్రము, వెల్లంకి తాతంభట్టు రచించిన లక్ష్మీకల్యాణము రచింపబడినట్లు తెలుస్తోంది. 16వ శతాబ్దం నుండి యక్షగానాలు లభ్యమవుతున్నాయి. వాటిలో చక్రవర్తి రాఘవాచార్యుని విప్రనారాయణ చరిత్ర, కందుకూరి రుద్రకవి సుగ్రీవ విజయము మొదలైనవి. 17వ శతాబ్దంలో యక్షగాన ప్రక్రియ అభినయంతోపాటు సంస్కృత నాటకపు మెరుగులు దిద్దుకుందని చెప్పవచ్చు. ఈ పరిణామ క్రమంలో యక్షగానాలు పారిజాతములుగాను, భాగవతములుగాను, యక్షగాననాటకములు గాను, యక్షగాన ప్రబంధాలుగాను వెలువడ్డాయి. ఈ క్రమంలో అనేకమంది యక్షగాన కవులు, కవయిత్రులు వర్ధిల్లారు. అటువంటి కవయిత్రులలో మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ ఒకరు. ఆమె తపస్వినిగా తరిగొండలో ఉండి రచించిన ఐదు కృతులలో బాలకృష్ణనాటక యక్షగానం ఒకటి.

## కథ

బాలకృష్ణ నాటకంతో శ్రీకృష్ణుడు బృందావనంలో కాలానుగుణంగా అనేక లీలలు ప్రదర్శిస్తాడు. ఒకరోజు శరదృతువులో కార్తీక పౌర్ణమినాడు యమునా తీరంలో మనోహరంగా వేణుగానం చేస్తుంటాడు. ఆ నదీ తీరానికి ఈశ్వరుడు (తలకోన సిద్ధేశ్వరుడు) నక్కజోగి వేషంలో కాకులను వేటాడడానికి వస్తాడు. అపుడు ఈశ్వరుడు కాకులు లేచి పోయే విధంగా నా వద్ద వేణుగానం చేయవద్దని కృష్ణుణ్ణి ఆజ్ఞాపిస్తాడు. నీవెవడవురా అని కృష్ణుడు ప్రశ్నిస్తాడు. నీ వెవరో ముందుగా తెల్పరా అని నక్కజోగి ఎదురు ప్రశ్న వేస్తాడు. వారిరువురు ఒకరి గురించి ఒకరు తెలుసుకున్న తరువాత నక్కజోగి వైపు శ్రీకృష్ణుడు విశ్వాస పూర్వకంగా చూస్తాడు. తరువాత నక్కజోగి తన దారిన తాను వెళ్ళిపోతాడు.

పౌర్ణమి రోజు రాత్రి శ్రీకృష్ణుని వేణునాదం విని రేపల్లెలో ఉన్న గోపికలందరు అక్కడకు వస్తారు. ఆ విధంగా వచ్చిన గోపికలు భక్తితో బాలకృష్ణుణ్ణి స్తుతిస్తారు. శ్రీకృష్ణుడు ఆ గోపికలను చూసి ఈ విధంగా ఇంటిని వదలి రావడం మంచిది కాదని, నిందల పాలవుతారని, మీమీ భర్తల వద్దకు తిరిగి వెళ్ళిపొమ్మని హెచ్చరిస్తాడు. ఆ తరువాత వారందరిని ఆదరించి వారికి సుమధుర ప్రణయ పూర్వకమైన సుఖాన్ని అనుగ్రహిస్తాడు. వారి మనస్సులో అంకురించిన అహంభావాన్ని అణచాలని నిర్ణయించుకొని శ్రీకృష్ణుడు నృత్యం చేస్తూ క్షణంలో అదృశ్య మవుతాడు. అపుడా గోపికలందరు ఎంతగానో బాధపడుతు కృష్ణుని కోసం అన్ని వైపులా వెతుకుతారు. అపుడు శ్రీకృష్ణుడు వారి దీనాలాపాలను విని కరుణించి ప్రసన్నుడవుతాడు. వారిని సంతోషింపజేయడానికి యమునా తీరంలోని ఒక కమల సరోవరంలో వారితో కలిసి జలక్రీడలాడుతాడు.

అంతలో రాధాదేవి మేల్కొని పన్నీటిలో జలకమాడి అలంకరించుకొని చెలికత్తెలతో కలిసి బృందావనానికి వస్తుంది. నిత్యం ఉండే చోట శ్రీకృష్ణుడు లేనందువల్ల రాధాదేవి చెట్లు, గుట్టలు, పక్షులు మొదలైన ప్రకృతిలోని పరివారాన్ని కృష్ణుని జాడ గురించి ఆప్యాయంగా అడుగుతుంది. ఆమెను ఆటపట్టించడానికి ఎక్కడైనా దాగి ఉన్నాడేమో అని ఎలుగెత్తి పిలుస్తుంది. అపుడు మాయక వికార రూపిణి అయిన స్త్రీ (శ్రీహరియొక్క యోగమాయి-నక్కజోగిని భార్య) తన భర్త అయిన నక్కజోగిని వెదుకుతు అక్కడకు వస్తుంది.

రాధ, మాయిక ఒకరి వృత్తాంతం ఒకరు తెలుసుకుంటారు. శ్రీకృష్ణుడు గోపస్త్రీలతో జలక్రీడలాడుతున్న విషయం మాయికవల్ల తెలుసుకున్న రాధ పరివిధాలుగా బాధపడుతుంది. మన్మథుణ్ణి, చంద్రుణ్ణి, దూషిస్తూ తీవ్రమైన విరహవేదనకు గురవుతుంది. చివరకు ఆమె మూర్ఛిల్లితుంది. ఆమె చెలికత్తెల పరిచర్యల చేత మూర్ఛనుండి తేరుకొని కృష్ణుణ్ణి పిలుచుకొని రావసిందిగా మాయికను పంపుతుంది.

మాయికవల్ల రాధాదేవి పరిస్థితి తెలుసుకున్న మాధవుడు రాధ దగ్గరకు వస్తాడు. అపుడు రాధ శ్రీకృష్ణుని యెడల బింకాన్ని ప్రదర్శిస్తుంది. అంతలో గోపికలంతా అక్కడకు వస్తారు. రాధ వాళ్లతో కలహిస్తుంది. ఆ కలహంలో రాధకు మాయిక అండగా నిలుస్తుంది. అందువల్ల గోపికలందరు కలిసి మాయికను ఒక చెట్టుకు కట్టేసి కొడుతూ వుంటారు. రాధ వారందరిని ఎదిరించి మాయికను విడిపిస్తుంది.

శ్రీ కృష్ణుడు తన పలుకులతో రాధకు, గోపికలకు మధ్య సయోధ్య ఏర్పరుస్తాడు. ఒకరోజు రాధ, ఒకరోజు గోపికలు వచ్చి, బృందావనంలో శ్రీకృష్ణుణ్ణి కలవాలని మాయిక నియమాన్ని ఏర్పరుస్తుంది. అందుకు వారు అంగీకరిస్తారు. లీలా వినోది అయిన శ్రీకృష్ణుని దృష్టి తగలకుండ రాధాదేవి మంగళహారతి ఇస్తుంది. అంతటితో ఈయక్షగానం సుఖాంతమవుతుంది.

## యక్షగాన వైశిష్ట్యం

శ్రీకృష్ణుని బాల్య లీలలో విశిష్టమైనది రాసలీల. ఆ కథాంశాన్ని ఆధారంగా చేసుకొని, ఈ యక్షాగానాన్ని రచించినందువల్ల రచయిత్రి ఈ యక్షగానానికి 'బాలకృష్ణ నాటకమనే' పేరు పెట్టి ఉంటుందని చెప్పవచ్చు. ఆ విషయాన్ని కవయిత్రి ఈ యక్షగాన ఆరంభంలో ఈ కింది పద్యంలో పేర్కొంది.

**తే॥గీ॥ ప్రకటముగ బాలకృష్ణనాటకమనంగ**
**నొక్కకృతి దగ యక్షగానోక్తిగాను**
**వెలయ రచించె నింజేటి వెంగమాంబ**
**ఇమ్మహిని దత్కథాక్రమం బెట్టిదనిన**

*(బాలకృష్ణ నాటకము : 22)*

ఈ నాటకాన్ని శ్రీకృష్ణ నాటక మని కూడ వ్యవహరించవచ్చని ఈ యక్షగానం చివరలో కవయిత్రి తెలిపింది.

**ద్విపద**

**నరులెన్న శ్రీకృష్ణనాటకంబనెడు**
**వరకృతి గావించి వాసుదేవునకు**
**పరమ భక్తిని సమర్పణముగా జేసె**

*(బాలకృష్ణ నాటకము : 22)*

### మూలం

ఈ నాటకంలోని కథకు మూలం శ్రీమద్భాగవతం. దశమస్కంధం పూర్వార్ధంలో 'రాస పంచాధ్యాయి' అనే పేరిట 29వ అధ్యాయం నుండి 33వ అధ్యాయం వరకు మొత్తం 176 శ్లోకాలు ఉన్నాయి. పోతన భాగవతంలోని దశమస్కంధ పూర్వభాగంలో 150 గద్య పద్యాలలో ఈరాసలీల ఘట్టం ఉంది. వెంగమాంబ మూలకథకు రాధ వృత్తాంతాన్ని, నక్కజోగి వృత్తాంతాన్ని కల్పించి ఈ యక్షగానాన్ని రచించింది.

### పాత్రలు

ఈ నాటకంలో పాత్రలు కృష్ణుడు, రాధ, గోపికలు, నక్కజోగి, మాయిక, శ్రీకృష్ణుడు.

### ద్విపద

**వినుము నాతెఱఁగెల్ల-విశదంబుగాఁగ**
**ననువంద మున్ను మత్స్యావతారంబు**
**సురుచిరంబుగఁదాల్చి-సోమకుఁద్రుంచి**
**ధరనెన్న వేదముల్-ధాత కిచ్చితిని**

*(బాలకృష్ణ నాటకము : 6,7)*

ఈ ద్విపద పద్యంలో కవయిత్రి శ్రీకృష్ణుడి దశావతారాలను పరిచయం చేస్తుంది. ఈ విధంగా రచించడం వల్ల ఆ పాత్ర వైశిష్ట్యం వ్యక్తమవుతుంది. ఒక సామాన్య పాత్రకి, శ్రీకృష్ణుని పాత్ర చిత్రణకు గల వ్యత్యాసం కవయిత్రి రచనలో మనకు తెలుస్తుంది. అదేవిధంగా నక్కజోగి పాత్రను కూడా చిత్రించింది.

### ద్విపద

**విను కృష్ణ నా పూర్వ-వృత్తాంతమెల్ల**
**మునుపెందు దరిలేక-మాలనె యుండి**
**మాయవాడైనట్టి-మాతంగిఁగూడి**
**గాయకుండగుచు-నే-గర్వించినాను**

*(బాలకృష్ణ నాటకము : 7,8)*

అని ఆయా పాత్రల ఔచిత్యాన్ని ఆ పాత్రలతోనే పలికించింది. రాధ, గోపికలు, మాయిక మొదలైన పాత్రలను కూడ ఆయా పాత్రల స్వభావాన్ని ఆవిష్కరింపజేసి, సహజసిద్ధంగా చిత్రించింది కవయిత్రి

**శైలి**

వెంగమాంబ ఈయక్షగాన రచనలో పోతన భాగవతంలోని 1010 మొల్ల రామాయణంలోని 102 పద్యాలను అనుకరించి పద్యాలను రాసింది.

**నవ్వు ముఖంబువాడు, మృదునాద సువేణుంబూనినాడు వా**
**డివ్వసుధావధూరమణుం, డిందరకున్ ప్రియుడౌనవాండు మా**
**యవ్వనమూల్య మిప్పుడతండంతయు ద్రుచ్చిలి తెచ్చినాడు బల్**
**రవ్వలు జేసినాండిటకు రాండు గదా గిరులార చెప్పరే**

*(బాలకృష్ణ నాటకము : 23)*

పై పద్యంలో పోతన భాగవతం దశమస్కందంలో గల 'నల్లనివాడు పద్మనయనంబుల వాడు' 1010 అనే పద్యాన్ని అనుసరించినట్లు తెలుస్తుంది.

అలాగే రాధాదేవి మాయికకు కృష్ణుని రూపాన్ని వివరించే సందర్భంలో "నీల పద్యం నీరదమును బోలు దేహమువాడు, రమణీయ హేమాంబరంబు వాడు" (పు-43) అనే పద్యాన్ని మొల్ల రామాయణంలోని (సుందరకాండము-102). "నీలమేఘచ్ఛాయ బోలు దేహము వాడు ధవళాబ్జపత్రనేత్రములవాడు' అనే పద్యాన్ని అనుసరించి రాసినట్లు తెలుస్తుంది.

ఈ యక్షగానంలో త్రిపుట, జంపె, కురుచజంపె రేకులు, కందదరువులు, అనే గీతాలు సీసం, ఉత్పలమాల, కందం, తేటగీతి మొదలైన పద్యాలు కలవు. కొన్ని దరువులకు రాగ తాళాలేగాక, ఆ తాళాలకు రెండవకాలం, మూడవకాలం, నాలుగవకాలం మొదలైన కాల నిర్దేశం కూడా చెప్పారు.

**పరిష్కరణ**

ఈ యక్షగానం పరిష్కరణకు ఆధారంగా రెండు తాళపత్రులు లభించాయని పీఠికలో ఉంది. ఒకటి వాయల్పాడుకు సమీపంలో ఉన్న చిన్న తిప్ప సముద్రం (సి.టి.యం) గ్రామంలో నివాసముంటున్న 'శ్రీడాకరాజు వేంకటరావు' అనే వ్యక్తి ఇంటిలో లభించింది. అతడు వెంగమాంబ తండ్రి వంశస్తులకు బంధువు. ఈతాళ గ్రంథంలో 21 తాళపత్రాలున్నాయి. ఇది క్రీ.శ 1779 మే నెలలో రాయబడినట్లుగా స్వామికణ్ణన్ రచించిన "Indian Ephemeris ను బట్టి నిర్ణయించినట్లు పీఠికలో ఉంది.

రెండవ తాళపత్ర ప్రతి కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్ గ్రంథాలయంలో ఉంది. ప్రధానప్రతిలో శిథిలమైన భాగాలు ఈ ప్రతిలో లభించాయని, వీధి 36 తాళ పత్రాలున్నాయని పీఠికలో ఉంది.

ఈ విధంగా బాలకృష్ణ నాటకం అనే యక్షగానాన్ని తరిగొండ వెంగమాంబ ఇష్టదేవతా ప్రార్థనలో మొదలు పెట్టి దేశినాటకంగా తీర్చిదిద్దింది.

## ఉపయుక్తగ్రంథాలు


1. జోగారావు, యస్వీ. 1961. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర. ఆంధ్రవిశ్వకళాపరిషత్ప్రకాశికము.
2. వెంగమాంబ, తరిగొండ. 2007. బాలకృష్ణ నాటకము (యక్షగానము). తిరుమల తిరుపతి దేవస్థానము, తిరుపతి.
3. రాధాకృష్ణ మూర్తి, మిక్కిలినేని. 2011. తెలుగు వారి జానపద కళారూపాలు. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం, హైదరాబాదు.
4. శ్రీకాంత్ కుమార్, వెలురంగవల్లి. 2015. తెలంగాణ యక్షగాన వాఙ్మయము. తెలంగాణ జాగృతి, హైదరాబాదు.




# 9. కొలుపులు - అధ్యయనం

**కొలుపులు**

**ఒ**క గ్రామంలోని ప్రధాన దేవతను ఆ గ్రామంలోని ప్రజలే ఆరాధించడాన్ని కొలుపులు అని అంటారు. ఏగ్రామానికి ఆ గ్రామం వేరుగా కొలుపులు జరుపుకొంటుంది. ఈ కొలుపులలో ప్రజలు గ్రామదేవతల జాతరలలో పాటించే పద్ధతులు, ఉత్సవాలలో పాటించే పద్ధతులు కలగలిపి పాటిస్తారు.

కొలుపులు జానపద విజ్ఞానంలో భాగంగా పరిగణించబడుతుంది. కొన్ని ప్రాంతాలలో నేటికి కొలుపులు జరుపుకుంటున్నారు. 2013 సంవత్సరము జూన్ 20వ తేదీన ప్రకాశం జిల్లా, టంగుటూరు మండలం, కారుమంచి గ్రామానికివెళ్ళి సేకరించిన అంశం ఈ వ్యాసంలో పొందుపరచడమైంది.

జానపద విజ్ఞానం అనే అర్థంలో W.J. Thoms 1846 లో folklore అనే పదాన్ని వాడారు. Rechard M. Dorson తన folklore అనే గ్రంథంలో జానపద విజ్ఞానాన్ని నాలుగు శీర్షికలుగా విభజించారు. (1) వాగ్రూప సంస్కృతి (Oral folklore) (2) సాంఘిక జానపదాచారం (Socila folk Customs) (3) వస్తు సంస్కృతి లేదా భౌతిక సంస్కృతి (Matirial Culture) (4) జానపద కళలు (folk Arts)

మొదటిది అయిన వాగ్రూపు సంస్కృతిలో జానపద అభ్యాసం (Folklore Narratives) అఖ్యాన జానపద కవిత్వం (Narrative folk poetry) జానపదేతిహాసం (Folk Epic) సామెతలు సామెతలను పోలిన వ్యక్తీకరణాలు (Proverbs and Proverbial Expressions) పొడుపుకథలు (Riddles) జానపదుల భాష (Folk Speech) మొదలైనవి ఉంటాయి.

రెండవది సాంఘిక జానపదాచారం (Social folk custom)దీంట్లో పండుగలు మరియు ఉత్సవాలు (Festival and Celebrations) వినోదాలు మరియు ఆటలు (Recreation and Games) జానపద వైద్యం (folk Medicine) జానపద మతం (folk Religeon) మొదలైనవి చేరతాయి. పండుగలు, ఉత్సవాలు అనే విభాగం కిందికి కొలుపులు వస్తాయి.

మనదేశంలో హిందూ సంస్కృతిలో తెలుగు నెలలో అనేక పండుగలు వస్తుంటాయి. అవి ఉగాది, వినాయకచవితి, దసరా, దీపావళి సంక్రాంతి మొదలగునవి. వీటి తోపాటు మన సంస్కృతిలో భాగంగా గ్రామదేవతల జాతరలు, పరసలు, తిరునాళ్ళు తీర్థాలు, ముస్లింలకు చెందిన ఉరుసులు మొదలగునవి కూడా ఉన్నాయి. వీటన్నిటిని పండుగలు అని వ్యవహరిస్తాము.

ఆర్. ఎస్. బాగ్స్ పండుగని నిర్వచిస్తూ "సాంఘిక సంక్షేమం కోసం విశేష సందర్భాలలో జానపద విశేషాలు, సంప్రదాయాలకు అతీతంగా ఆచరించే సంక్షిప్తమైన అంశమే పండుగ" అన్నాడు. *(జి.యస్. మోహన్ : 2010-209)*

సంవత్సరమంతా కష్టపడి పనిచేసే కష్ట జీవులు ఆ కష్టం నుండి బయటపడి కొంతసేద దీరడం కోసం, పండుగలు, ఉత్సవాలు, జాతరలు, కొలుపులు, పరసలు మొదలగునవి జరుపు కుంటారు. వాటిలో ఆటలు, పాటలు, విందులు వినోదాలు ఏర్పాటు చేసుకొని సమష్టిగా జరుపుకొని ఆనందంగా గడుపుతారు.

ఒక గ్రామంలోని ప్రధాన దేవతను ఆ గ్రామంలోని ప్రజలే ఆరాధించడాన్ని "కొలుపులు" అని అంటారు. అంకమ్మతల్లి కొలుపులలో ప్రక్క గ్రామాల ప్రజలు పాల్గొనరు.

ప్రకాశం జిల్లా టంగుటూరు మండలం కారుమంచి గ్రామంలో ఆ గ్రామదేవత అయిన అంకమ్మతల్లి కొలుపులు జరుగుతాయి. ఆగ్రామానికి చెందిన జి. సుబ్బరామయ్య అనే వ్యక్తి అయిన ఈ కొలుపుల గురించి చెప్పారు. అతని వయస్సు 50 సం॥లు. అతడు మాలకులానికి చెందినవ్యక్తి. కారుమంచి గ్రామంలో ప్రతి 3 సం॥లకు ఒకసారి అంకమ్మతల్లి కొలుపులు జరుపుకుంటారు. ముందుగా ఆ గ్రామంలో షెడ్యూల్డు కులానికి చెందిన కాలనిలో నివసించే పదిమంది కులపెద్దలు అమ్మవారి గుడివద్ద సమావేశమవుతారు. ఈ కొలుపులు ఎప్పుడు జరపాలో నిర్ణయిస్తారు. తరువాత అమ్మవారి చరిత్ర తెలిసిన బైనీడివారిని పిలిపిస్తారు. బైనీడివారు వచ్చి అమ్మవారి పూజకు కావలసిన వస్తువులను సమకూర్చుకుంటారు. అంకమ్మతల్లి కొలుపులు మొత్తం పదిరోజులు జరుగుతాయి. మొదటి ఐదు రోజులు జోగి ఎత్తుతారు. పదిమంది పెద్దలలో ఒక వ్యక్తిని అమ్మవారిని ఎత్తుకోడానికి నియమిస్తారు. అమ్మవారిని ఎత్తుకోడమంటే అమ్మవారి రూపము దాల్చిన ఒక మట్టి ముంతను కులపెద్ద ఎత్తుకోవడం. ఆ వ్యక్తిని దేవర అంటారు. అతనితోపాటు నలుగురు బైనీడి వాళ్ళు, కొంతమంది గ్రామపెద్దలు కలిసి ఇంటింటికి తిరిగి జోగి ఎత్తుతారు. అపుడు గ్రామస్తులు అమ్మవారు తమ ఇంటి ముందుకి వచ్చినప్పుడు, ధనాన్నిగాని, ధాన్యాన్ని గాని ఇస్తారు. మొదటి ఐదు రోజులు ఇదేవిధంగా చేస్తారు.

ఈ జోగి ఎత్తడానికి ముందు బైనీడి వాళ్ళు, ఇంకా కొంతమంది పెద్దలు కలిసి గ్రామంలో ఉన్న గ్రామదేవతల ఆలయాలకు వెళతారు. అపుడు బైనీడివారు "ఏమయ్యా

గ్రామంలో ఉన్నటువంటి బడుగులవారు, అమ్మగారు వారు అయ్యగారు వారు, పల్నాటి వారు మారాసివారు స్థలము పరస్థలము తెలిసినవారు తెలియని వారూ ఈ యొక్క అమ్మవారి కొలుపులు జరిపించుటకు శలవేనయా" అని అంటారు. అపుడు ఆ గుడిలో పూజ చేసే పెద్దలు (పూజారులు) "ఆ శలవే, ఆ శలవే, ఆ శలవే" అని మూడుసార్లు అంటారు. ఇదేవిధంగా గ్రామంలోని అమ్మవారి దేవాలయాలకు వెళ్ళి "శలవే" అని అడిగివచ్చిన తరువాత ఆ మరుసటి రోజు నుండి జోగి ఎత్తుతారు. మొదటి ఐదు రోజులు జోగి అడుగుతారు.

## ఆరవరోజు

బైనీడి వాళ్ళు కులపెద్దలు కలిసి ఆరవరోజు తెల్లవారు జామున నాలుగు గంటలకు అమ్మవారి అవశేషాలు, (అనగా అమ్మవారి గవ్వలు, పావణం అనగా అమ్మవారి ఉత్సవ విగ్రహము, తీసుకొని ఒక మేకపోతు, కొన్ని బియ్యం, పసుపు కుంకుమ తీసుకొని మేళతాళాలతో కారుమంచి గ్రామానికి దగ్గరలో ఉన్న సముద్రం దగ్గరకు వెళతారు. ఆ తరువాత అందరు సముద్రంలో స్నానం చేస్తారు. ఆ సముద్రం దగ్గర బైనీడి వాళ్ళు అమ్మ వారి రూపం వచ్చేలా ఒక ముగ్గు వేస్తారు. ఆ ముగ్గు దగ్గర అమ్మవారి ఉత్సవ విగ్రహం, గవ్వలు మొదలగునవి ఉంచుతారు. తరువాత వారు వెంట తీసుకొని వెళ్ళిన మేకపోతుని బలిచ్చి, పొంగలి వండి అమ్మవారికి నైవేద్యం పెడతారు. పిమ్మట అమ్మవారి కథను చెప్పుకొని, అందరు భోజనాలు చేసి అదే రోజు సాయంత్రానికి గ్రామానికి చేరుకుంటారు. అందరు ఆగ్రామ పొలిమేరకు చేరుకోగానే మేళతాళాలతో అమ్మవారిని గ్రామంలోకి తీసుకొస్తారు. ఆ గ్రామ నడిబొడ్డులో ఉన్న మంచి నీటి చెరువులో ఒక ప్రక్కన నీళ్ళలో అమ్మవారిని ఉంచి ఎవరి ఇంటికి వారు వెళ్ళిపోతారు.

## ఏడవరోజు

ఏడవ రోజు మాత తుడుపు జరుగుతుంది. ఈ గ్రామంలో మన్నంవారు అనే కుటుంబానికి చెందిన వారు ఈ అంకమ్మ తల్లి కొలుపులు నిర్వహిస్తారు. వారి కుటుంబంలోని పిల్లలు, పెద్దలు అందరు అమ్మవారి గుడి వద్దకు వస్తారు. అప్పుడు బైనీడివారు అమ్మవారి గుడి ముందు ముగ్గువేసి మేకపోతుని బలి ఇస్తారు. అప్పుడు అబ్బాయి మాత తడుపు ఉన్నది అందరు కూర్చోండి అని బైనీడి వారు అంటారు. మన్నంవారు అమ్మవారి కొలుపులు జరిపిస్తున్నారు చూడండి అనగానే దీనినే ఆచారము జరిపిస్తున్నారు అని కూడా అంటారు. మిగిలినవారు అమ్మవారి గుడి ద్వారానికి ఇరువైపుల నిలబడతారు. మన్నంవారు నాలుగు ముంతల కల్లును తెప్పిస్తారు. అపుడు మాతంగిని అక్కడకు తీసుకువస్తారు. మాతంగి కొంతసేపు అమ్మవారివలె నృత్యం చేస్తుంది. ఆ తరువాత వేప ఆకులు కొన్ని నోట్లో ఉంచుకొని "తాటికల్లు"ను నోట్లో పోసుకొని ఈ కొలుపులు జరిపిస్తున్న వారి మీద ఊదుతుంది. ఆమె మొత్తం కల్లును అదే విధంగా మన్నంవారిపై చల్లుతుంది. అదేరోజు సాయంత్రం అమ్మవారి ఉత్సవ విగ్రహాన్ని

ఉంచిన చెరువు వద్దకు వెళ్ళి అక్కడ అమ్మవారి ముందు ముగ్గు వేసి అమ్మవారి కథను చెప్పి మేకపోతుని బలిఇస్తారు. ఆ తరువాత నీటిలో ఉంచిన అమ్మవారి ఉత్సవ విగ్రహాన్ని తీసుకొని ఊరేగిస్తూ అమ్మవారి గుడి వద్దకు వస్తారు.

## ఎనిమిదవ రోజు

ఎనిమిదవరోజు సుడికప్పెర జరుపుతారు. ఆరోజున ఉదయం అందరు అమ్మవారి గుడివద్దకు చేరుకుంటారు. అమ్మవారికి పొంగలి నైవేద్యం పెడతారు. ఆ తరువాత బైనీడి వారు అమ్మవారి గుడి ముందు ముగ్గు వేస్తారు. ఒక మేకపోతును బైనీడి వాళ్ళు ఆ ముగ్గు ముందు ఉంచుతారు. ఆ తరువాత వారు ఆ మేకపోతు ప్రాణముండగానే దాని కడుపు నుండి పేగులు, ఊపిరితిత్తులు బయటికి తీస్తారు. మేకపోతు ఊపిరి తిత్తులను వారు దొబ్బ అంటారు. వారు ఆ మేకపోతును చెత్తలోకి విసిరేస్తారు. బైనీడివాళ్ళలో ఒక వ్యక్తికి నల్లని వస్త్రాలు కట్టి, ఎర్రని బొట్టు పెట్టి మేకపోతు పేగులను కొన్ని అతని చేతులకు కట్టి, కొన్ని పేగులను అతని మెడలో వేసి దొబ్బ ను (ఊపిరితిత్తులు) ను అతని నోట్లో పెట్టి అలంకరిస్తారు. ఆ తరువాత ఒక కుండను తీసికొని సమానంగా మధ్యలోకి పగులగొట్టి దాని పై భాగాన కొన్ని పుల్లలను నిలబెడతారు. మేకపోతు పేగులను కొన్నింటిని తీసుకొని ఆ పుల్లలకు అల్లుతారు. ఈ విధంగా అలంకరించిన ఆ కుండను నల్లని వస్త్రాలు ధరించిన బైనీడి వ్యక్తి తలపై పెడతారు. ఆ తరువాత నోట్లో ఉంచిన దొబ్బను ఒకచోట దాచిపెడతారు. అపుడా వ్యక్తి దాచిపెట్టిన దొబ్బను వెతికి పట్టుకొని దాన్ని నోట్లో పెట్టుకొని, కుండను నెత్తిమీద పెట్టుకొని ఒక గంటసేపు నృత్యము చేస్తాడు. కొందరు ఈ నృత్యాన్ని చూసి భయపడతారు. తల్లిదండ్రులు చిన్నపిల్లలు ఆ నృత్యం చూడకుండ జాగ్రత్త పడతారు. ఈ దృశ్యం అంత భయాన్ని కలిగిస్తుంది. ఆ బైనీడి వ్యక్తి ఆవిధంగా నాట్యం చేస్తు దారి వెంట పరిగెడతాడు. అలా పరిగెత్తుకుంటూ వెళ్ళి ఆ గ్రామ పొలిమేరలో ఆ కుండను పడేస్తాడు. అదే సమయంలో గ్రామపెద్దలు వేరొక మేకపోతు తలను నరికి ఒక గంపలో ఉంచి బలి అంకయ్య అనే వ్యక్తి తలపై ఆ గంపను ఉంచుతారు. ఆ బలి అంకయ్య ఆ గంపను నెత్తిపై పెట్టుకొని నడుస్తుంటాడు. ఆ గ్రామంలోని యువకులు గంప పై భాగాన కర్రతో కొట్టుకుంటూ అతని వెనక వెళతారు. ఆ విధంగా చేస్తూ ఆ గంపను కూడ ఆ ఊరి పొలిమేరలో పడేస్తారు. యువకులు ఆ గంపపైన ఎందుకు కొడతారంటే ఆ గంప ఎత్తుకున్న అంకయ్యను అమ్మవారు బలి తీసుకో కుండ ఉండడానికి చేస్తారు. ఈ ఆచారాన్ని ఆ గ్రామస్థులు తమ పూర్వీకుల కాలం నుండి చేస్తున్నట్లు చెబుతారు.

## తొమ్మిదవ రోజు

తొమ్మిదవ రోజు గ్రామ ఉత్సవం చేస్తారు. ఆ రోజు గ్రామంలో అమ్మవారి ఊరేగింపు చేస్తారు. ఒకవ్యక్తికి చిన్నపాప వేషము వేస్తారు. ఒక వ్యక్తి పూల కప్పెర పట్టుకుంటాడు.

పూలకప్పెర అనగా దూదితో పూల వృక్షం చేస్తాడు. ఒక వ్యక్తి వేప మండలు పట్టుకొని నృత్యం చేస్తాడు. వేరొక వ్యక్తి అమ్మవారి వలె అలంకరించుకుంటాడు. వీరంతా కలిసి తొమ్మిదవరోజు ఊరేగింపుగా ఊరంతా తిరుగుతారు. ఈ ఊరేగింపునే ఆ గ్రామస్తులు ఉత్సవం అని పిలుస్తారు.

## పదవరోజు

పదవరోజు గ్రామస్తులు అందరు ఎవరి శక్తికి తగినట్లుగా వారు మేకపోతులను, కోళ్ళను బలి ఇచ్చి వాటిని ఇంటికి తీసుకొని వెళ్ళి పొంగలివండి సాయంత్రం 5 గం॥లకు అమ్మవారికి నైవేద్యం పెడతారు. అంకమ్మతల్లి కొలుపులు నిర్వహించినవారు. రాత్రి భార్యా, భర్త ఇరువురు కొంగుముడితో వచ్చి అమ్మవారి సన్నిధిలో తలంబ్రాలు పోసుకుంటారు. ఈ తంతు పదవరోజు సాయంత్రం ఎనిమిది నుండి పది గంటల వరకు జరుగుతుంది. ఈ విధంగా కారుమంచి గ్రామంలోని అంకమ్మ తల్లి కొలుపులు జరుగుతాయి.

## ఆచార సంప్రదాయాలు

ప్రకాశం జిల్లా టంగుటూరు మండలం, కారుమంచి గ్రామంలో జరిగే అంకమ్మ తల్లి కొలుపులలో ఆ గ్రామస్థుల ఆచార సంప్రదాయాలు మనకు తెలుస్తున్నాయి.

మంచిరోజు చూసుకొని షెడ్యూల్డ్ కులంలోని కులపెద్దలు పదిమంది అమ్మవారి గుడివద్ద సమావేశమై అమ్మవారి కొలుపులు ఎప్పుడు జరపాలో నిర్ణయించుకుంటారు. అమ్మవారి చరిత్ర తెలిసిన బైనీడివారిని అక్కడకు పిలిపిస్తారు. వీరు అమ్మగుడి ముందు అమ్మవారి ముగ్గు వేస్తారు. మన్నంవారు అమ్మవారి కొలుపులు నిర్వహిస్తారు. వీటన్నింటిని పరిశీలించినట్లైతే ఆగ్రామంలోని ప్రజల సమష్టి జీవన విధానం మనకు తెలుస్తుంది.

## జోగి ఎత్తడం

ఆ జోగి ఎత్తడమనే దానిని ఆధునిక సమాజంలో కూడా కొంతమంది ఆచరిస్తూ ఉంటారు. సంతానం లేనివారు వారికి సంతానం కలిగితే జోగి ఎత్తి తిరుపతికి గాని, షిరిడీకి గాని వస్తామని మొక్కుకుంటారు. కొంతమంది జోగిఎత్తిన ధనంతో పుట్టిన బిడ్డకు చెవిపోగులు చేయిస్తామని, మరికొంతమంది కొన్ని గ్రామాలలో జోగి ఎత్తుతామని మొక్కు కుంటారు.

వారి కోరిక తీరిన తరువాత మేళతాళాలతో వారు మొక్కుకున్న గ్రామాలలో తిరుగుతూ జోగి ఎత్తి మొక్కులు తీర్చుకుంటారు. కొంతమంది గ్రామాలలో జోగి ఎత్తేటప్పుడు కుల వివక్షను చూపిస్తారు. వారు గ్రామంలో తిరుగు తున్నపుడు షెడ్యూల్డు కులాల వారి ఇళ్ళు ఉండే ప్రాంతానికి వచ్చినప్పుడు మేళతాళాలను వాయించడం ఆపివేసి జోగి ఎత్తడం కూడ మానేసి వెళ్ళిపోతుంటారు. సమాజంలో ఎంత ధనవంతులయినప్పటికి వారు మొక్కుకున్న విధంగానే జోగి ఎత్తి, ఆ ధనంతోనే తమ మొక్కులు తీర్చుకుంటారు.

ఈ అంకమ్మ తల్లి కొలుపులు చేయడానికి మొదటి ఐదు రోజులు జోగి ఎత్తుతారు. ఆ గ్రామంలోని ప్రజలందరు సామూహికంగా కొలుపులు జరపడానికి సహాయం చేస్తారు. ప్రజలందరు ఎవరికి తోచినంత వారు సహాయం చేయడమనేది చెప్పుకోదగిన అంశం.

## అమ్మవారి ముగ్గు వేయడం

బైనీడివారు అమ్మవారి ఉత్సవమూర్తుల ముందు అమ్మవారి గుడి ముందు అమ్మవారి రూపాన్ని ముగ్గుగా వేస్తారు. అమ్మవారి ముగ్గువేసిన ప్రతిసారి మేకపోతుని బలి ఇచ్చే ఆచారం మనకు కనబడుతుంది.

## మాతతడుపు

ఏడవ రోజు అమ్మవారి కొలుపులు జరిపించే మన్నంవారు వచ్చి అమ్మవారి గుడిముందు కూర్చుంటారు. అపుడు ఒక మాతంగి వచ్చి కొంతసేపు అమ్మవారిలాగ నృత్యం చేసి ఆ తరువాత వేపాకులు నోట్లో ఉంచుకొని తాటికల్లు నోట్లో పోసుకొని అమ్మవారి కొలుపులు జరిపించే మన్నంవారిపై ఆ కల్లుని ఊదుతుంది. ఆ విధంగా చేయడమనేది కొలుపులు జరిగేటప్పుడు ఆ గ్రామస్థులు ఆచరించే ప్రత్యేకమైన ఆచారం. ఈ ఆచారాన్ని వారు మాతతడుపు అని పిలుస్తున్నారు.

## సుడికప్పెర

ఎనిమిదవరోజు చేసే సుడికప్పెర అనేది కూడా ఒక ప్రత్యేక ఆచారంగా మనకు కనబడుతుంది. ఎనిమిదవ రోజు ఒక మేకపోతు ప్రాణముండగానే దాని పొట్టలో పేగులు ఊపిరితిత్తులు బయటకి తీసి ఒక బైనీడి వ్యక్తికి అలంకరించడం, కొన్ని పేగులను పగలగొట్టిన కుండలో పుల్లలు పెట్టి ఆ పుల్లలకు పేగులు చుట్టి ఆ కుండను బలి అంకయ్య తలపై పెడతారు. అతడు ఒకగంటసేపు వికృతంగా నృత్యం చేస్తాడు. ఆ విధంగా చేస్తూ దారి వెంట పరిగెడుతూ ఆ ఊరు పొలిమేరకు చేరుకుని ఆకుండను ఆ ఊరి పొలిమేరలో పడేస్తాడు. అదే సమయంలో ఒక మేకపోతు తల నరికి ఒక గంపలో పెట్టి, ఆ గంపను అతని తలపై పెట్టి, కొంతమంది యువకులు కర్రలతో ఆ గంపపై కొట్టుకుంటూ అతణ్ణి ఊరి పొలిమేర వరకు తీసుకొని వెళతారు. అపుడు అతడు ఆ గంపను ఊరి పొలిమేరలో పడేస్తాడు. ఇక్కడ జానపదుల నమ్మకం కూడా మనకు తెలుస్తుంది.

గంపను ఎత్తుకున్న వ్యక్తిని అమ్మవారు ఆవహించి అతనికి ఏవిధమైన హాని జరుగకూడదనే సదుద్దేశంతో యువకులు గంపపై కర్రలతో కొడతారు. వారు ఆవిధంగా కర్రలతో కొట్టడం వల్ల అమ్మవారు పైకి లేవకుండ ఉంటుందని బలి అంకయ్య క్షేమంగా ఉంటాడని ఆ గ్రామస్థుల నమ్మకం.

## పూలకప్పెర

తొమ్మిదవ రోజు పూలకప్పెర జరపడం అనేది ఈ గ్రామస్థులు ఆచరించే ఆచారం. దూదితో పూల వృక్షం తయారుచేసి ఒక వ్యక్తి దాన్ని పట్టుకుంటాడు. ఒక వ్యక్తి పాపవేషం వేసుకుంటాడు. మరొక వ్యక్తి అమ్మవారి వేషధారణ చేస్తాడు. ఇంకొక వ్యక్తి వేపమండలు ధరించి నృత్యం చేస్తాడు. ఆ విధంగా తొమ్మిదవ రోజు ఆ గ్రామంలో ఉత్సవం జరుగుతుంది. ఇది వారి సంస్కృతిలో ఒక భాగమని వ్యక్తమవుతుంది. చివరగా పదవరోజు ఈ కొలుపులు నిర్వహించిన వారు రాత్రి 8 నుండి 10 గం॥ల వరకు భార్యాభర్తలు కొంగుముడితో వచ్చి అమ్మవారి సన్నిధిలో తలంబ్రాలు పోసుకుంటారు. ఈవిధంగా చేయడం వల్ల వారి సంసారం ఎటువంటి అరమరికలు లేకుండ నడుస్తుందనే నమ్మకం.

ఈవిధంగా కారుమంచి గ్రామంలో నిర్వహించే అంకమ్మ తల్లి కొలుపుల వల్ల, ఆ గ్రామంలోని కుటుంబాలలో ఉండే సమిష్టి జీవన విధానం వ్యక్తమవుతుంది. ఆ గ్రామస్థుల ఆచార సంప్రదాయాలు, నమ్మకాలు మనకు తెలుస్తున్నాయి. ఈ కొలుపులు నిర్వహించడంలో బైనీడీ వారికి ఉన్న ప్రాధాన్యత వెల్లడి అవుతుంది.

ఈ విధంగా మరి కొంత పరిశోధన చేయవలసిన ఆవశ్యకత కనిపిస్తుంది.

## ఉపయుక్తగ్రంథాలు

1. కృష్ణకుమారి, నాయిని. 1990. తెలుగు జానపద గేయగాథలు. తెలుగు అకాడమి, హైద్రాబాద్.
2. మోహన్, జి.యస్. 2010. జానపద విజ్ఞానాధ్యయనం. ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పం
3. క్షేత్రపర్యటన



(జానపద విజ్ఞానం–భావితరాలకు ప్రయోజనం జాతీయ సదస్సు. డిసెంబరు 17, 18, 2018. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి.)

*(భావవీణ జూన్ 2019. ప్రధాన సంపాదకులు పిట్ల శాంతి, గుంటూరు).*

# 10. పోలేరమ్మ జాతర

ప్రకాశం జిల్లా టంగుటూరు మండలంలోని కారుమంచి గ్రామానికి గ్రామ దేవత పోలేరమ్మ. ఈ గ్రామదేవతకు ఐదు ఏళ్లకు ఒకసారి జాతర జరుగుతుంది. [1]గ్రామస్థులు ఈ జాతరను పదిహేను రోజులు చేస్తారు. వారు ఒక మంచి రోజు చూసుకొని ఇంటికొకరు చొప్పున పోలేరమ్మ గుడివద్ద సమావేశ మవుతారు. అందరు కలిసి జాతరకయ్యే ఖర్చుని లెక్కగట్టి, దానికి అదనంగా ఒక లక్షరూ॥లు ఉండేట్లు ప్రతి ఇంటి నుండి డబ్బు వసూలు చేస్తారు. జాతర మొదలు పెట్టడానికి ముందురోజు రాత్రి అన్నం వండిన తరువాత మర్నాడు ఉదయాన్నే నిండుకుండ అన్నాన్ని ఒక పళ్లెంలోకి తీసుకొని దానిలో పెరుగువేసి గుడిలో అమ్మవారి ముందు ఉంచుతారు. దీనినే ఆ గ్రామస్తులు అమ్మవారికి సద్దిపెట్టడం అంటారు. ఈ విధంగా ఐదు రోజులు చేస్తారు.

**ఆరవ రోజు**

ఆరవ రోజు ముందుగా అన్నం వండి ఉంచుతారు. ఆ తరువాత అమ్మవారి గుడి ముందు ఒక గొఱ్ఱెపోతును బలిచ్చి దాని రక్తాన్ని పట్టి ముందుగా వండిన అన్నంలో ఆ రక్తాన్ని కలుపుతారు. ఆ అన్నాన్ని పోలికూడు అంటారు. ఆ రక్తం కలిపిన అన్నాన్ని ఒక పెద్ద కుండ పై భాగం పగులగొట్టి ఆ కుండలో పోస్తారు. ఆ కుండను బలి సమర్పించే వ్యక్తి నెత్తి మీద పెడతారు. గ్రామంలో కొంతమంది పురుషులు కర్రలు పట్టుకుంటారు. ఒకరు కత్తి, మరొకరు కొడవలి, వేరొకరు బరిశ పట్టుకొని 70, 80 మంది అర్ధరాత్రి 12 గం॥ల సమయంలో బలి ఇచ్చే వ్యక్తి వెంట వెళతారు. వారందరు పోలేరుగా, పోలేరుగా అంటు పెద్ద పెద్దగా అరుస్తూ గ్రామం వెలుపల చుట్టూ పోలికూడు చల్లుతారు.

---

*1 ఈ జాతర గురించి చెప్పినవారు జి. సుబ్బరామయ్య గారు ఆయన వయస్సు 50 సంవత్సరాలు. ఆయన మాల సామాజిక వర్గానికి చెందినవారు.*

## ఏడవరోజు

ఏడవరోజు గ్రామస్తులందరు అమ్మవారి గుడినుండి, మేళతాళాలతో బయలుదేరి గ్రామం మధ్యలో ఉన్న వేపచెట్టు వద్దకు వస్తారు. ఆ చెట్టునుండి ఒక లావు కొమ్మను కొట్టి దానిని ఊరేగిస్తూ కంసాలి వద్దకు తీసుకొని వెళతారు. ఆ కొమ్మతో కనకదుర్గ బొమ్మను చేయమని అతనితో చెబుతారు. అదేరోజు గ్రామంలో ఊరేగింపు జరుగుతుంది.

## ఎనిమిదవరోజు

ఎనిమిదవరోజు కంసాలి తయారుచేసిన "కనకదుర్గమ్మ" అమ్మ వారి విగ్రహాన్ని గ్రామస్తు లందరు మేళతాళాలతో ఊరేగిస్తూ గ్రామంలోకి తీసుకొనివస్తారు. అందరూ కలిసి అమ్మవారిని గ్రామం మధ్యలో ఉన్న మంచి నీటి చెరువులో ఒక పక్కన ఉంచుతారు. దీనినే అమ్మని జెలిదిలో ఉంచడం అంటారు. ఆ గ్రామంలో ఉన్న ఎట్టివాళ్ళను ఒక చెరువులో ఉంచిన కనదుర్గమ్మ అమ్మవారికి కాపలా ఉంచుతారు. అదేరోజు సాయంత్రం 5 గం॥లకు గ్రామంలో అందరు చెరువు వద్దకు వచ్చి అక్కడ అమ్మవారి ముగ్గు వేస్తారు. బైనీడి వాళ్ళు ఆ ముగ్గు దగ్గర పూజలు చేస్తారు. ఆ తరువాత అమ్మవారికి ఒక గొఱ్ఱెపోతును బలిస్తారు. అపుడు అందరూ కలిసి అమ్మవారి చరిత్రను కథగా చెప్పుకుంటారు. ఆ తరువాత జెలిదిలో ఉంచిన కనకదుర్గమ్మను బయటికి తీసి మేళతాళాలతో ఊరంతా ఊరేగించి, ఆ గ్రామంలో ఉన్న ఒక విశాలమైన స్థలంలో అమ్మవారి విగ్రహాన్ని ఉంచుతారు. ఆ స్థలంలో గడ్డితో అమ్మవారి గుడి నిర్మిస్తారు. అమ్మవారికి మొక్కుబడులు చెల్లించుకోమని అదే రోజు సాయంత్రం దండోరా వేయిస్తారు.

## తొమ్మిదవరోజు

తొమ్మిదవరోజు ప్రజలందరు కనకదుర్గమ్మకు ఉదయం నుండి మధ్యాహ్నం వరకు కోళ్ళను, మేకపోతులను బలిస్తారు. అదే రోజు మధ్యాహ్నం కనకదుర్గమ్మ అమ్మవారిని ఒక వ్యక్తి నెత్తిమీద ఉంచుకొంటాడు. అతని తోపాటు కొంతమంది గ్రామస్థులు కర్రలు పట్టుకొని బయలు దేరుతారు. అందరూ కలసి కారుమంచి గ్రామానికి పక్క గ్రామమయిన 'జయవరం' గ్రామం పొలిమేరలో కనకదుర్గమ్మ అమ్మవారిని ఉంచుతారు. ఆ తరువాత అందరూ కలిసి "రేయి అయినంపూడి సుచ్చా కనకదుర్గమ్మని పొలిమేరలో ఉంచాము తీసుకుపొండిరా" అని మూడు సార్లు పెద్దగా అరచి తిరిగి గ్రామానికి వచ్చేస్తారు. కనకదుర్గమ్మ అమ్మవారిని గుడి నుండి బయటికి తీసిన వెంటనే ఆ గుడిని కాల్చి వేస్తారు. ఆ గుడిని తగుల బెట్టకపోతే అమ్మవారు మరలా తిరిగివచ్చి ఆ గుడిలో కూర్చుంటుందని, ఆ విధంగా కూర్చుంటే అమ్మవారి కోర్కెలు తీర్చడానికి ఆగ్రామస్థుల శక్తి సరిపోదని గ్రామస్థుల నమ్మకం. అందుచేతనే కనకదుర్గమ్మను ఉంచిన గుడిని తగులబెడతారు.

## పదవరోజు

పదవరోజు మారెమ్మ అమ్మవారికి, రొట్టెల సాయిబాబాకి ప్రత్యేక పూజలు నిర్వహిస్తారు. పోలేరమ్మ రాక్షసులతో యుద్ధం చేసేటప్పుడు ఆమెకు ఎవరు సహాయం చేశారనే విషయం గ్రామస్థులు చెప్పుకుంటారు. అందువల్ల ఈ పోలేరమ్మ జాతరలో పదవరోజు వీరికి ప్రత్యేక పూజ నిర్వహిస్తారు.

## పదకొండవరోజు

పదకొండవరోజున నడివీధి జాతర చేస్తారు. ఆ రోజు గ్రామం నడిబొడ్డున అమ్మవారి ముగ్గు పెద్దగా వేస్తారు. అక్కడ బైనీడివాళ్ళు అమ్మవారి చరిత్రను చెబుతారు. తరువాత ఆ ముగ్గుముందు దున్నపోతును నరుకుతారు.

## దున్నపోతు నరికే విధానం

కారుమంచి గ్రామంలో "పెద్దమాదిగ" అనే వ్యక్తి ఉంటాడు. అతణ్ని పిలిపిస్తారు. ఆ గ్రామప్రజల అందరి ముందు "ఒరేయ్ అబ్బాయి" దున్నపోతును నరకాలి ఎన్ని వేటులకు నరుకుతావు అని అడుగుతారు. అప్పుడతుడు దున్నపోతును ఒకేఒక్క వేటుకి నరుకుతా నంటాడు. "ఒరేయ్ ఆలోచించుకో ఒకే ఒక వేటుకు దున్నపోతుని నరక లేదో రెండో వేటు నీ మెడమీద పడుతుంది" అని మునసబు ముందు గ్రామపెద్దల ముందు పెద్దగా అరిచి చెబుతారు. దున్నపోతుని అక్కడ ఉన్నవారిలో కొంతమంది రాళ్ళతోకొట్టి పట్టుకొని ఉంటారు. ఆ పెద్ద మాదిగ అమ్మవారిని తలచుకొని ఒకే వేటుతో ఆ దున్నపోతుని నరుకుతారు. ఆ వ్యక్తి ఒకేవేటుకి దున్నపోతుని నరకపోతే రెండోవేటుకి ఆ వ్యక్తిని నరికిన సంఘటనలున్నాయని ఈ కథ చెప్పిన వ్యక్తి చెప్పాడు. "గ్రామస్థులందరు దున్నపోతు తలను ఒక గంపలో ఉంచుకొని ఊరేగింపుగా వెళ్ళి పోలేరమ్మ గుడి దగ్గరకు వచ్చి పోలేరమ్మ ముందు ఆతలను ఉంచి కొంత సమయం తరువాత ఆ తలను తొలగిస్తారు.

## పన్నెండవరోజు

పన్నెండవరోజు అమ్మవారి గుడి ముందు ఉదయం నుండి సాయంత్రం వరకు అమ్మవారి చరిత్రను కథలుగా చెప్పుకుంటారు. సాయంత్రం అయిన తరువాత అమ్మవారిని గ్రామంలో ఊరేగిస్తారు.

## పదమూడవ రోజు

పదమూడవరోజు గ్రామంలో అందరు శక్తి కొద్దీ మేళతాళాలు ఏర్పాటు చేసుకొని ఎడ్లబండి కట్టుకొని వచ్చి ఆ బండిని అమ్మవారి గుడి చుట్టు తిప్పుకొని వెళుతుంటారు. అదే రోజు సాయంత్రం గ్రామంలో ఊరేగింపు జరుగుతుంది.

## పదునాల్గవరోజు

పదునాల్గవరోజు ఉదయాన్నే గ్రామస్తు లందరు మేకలు, కోళ్ళు బలిఇస్తారు. అదే రోజు సాయంత్రం అమ్మవారిని ఊరేగిస్తారు.

## పదిహేనవరోజు

పదిహేనవరోజు ఉదయం 10 గం॥ల నుండి 12 గంటలలోపు ఎవరికి వచ్చిన విధంగా వారు పొంగళ్ళు వండి ఉంచుతారు. మధ్యాహ్నం 3 గం॥ల నుండి ప్రజలందరు పొంగలిని తీసుకొని ఊరేగింపుగా వచ్చి అమ్మవారికి నైవేద్యంగా అమ్మవారి ముందు ఉంచుతారు. ఈ విధంగా పోలేరమ్మ జాతర ముగుస్తుంది.

క్షేత్రపర్యటన.



# 11. పెద్ద గట్టు జాతర

**ఈ** జాతర గురించి చెప్పిన వారు జంగయ్య. అతని వయస్సు 55 సంవత్సరాలు. తెలంగాణ రాష్ట్రంలోని నల్లగొండ జిల్లా సూర్యాపేట తాలూకాలో గల దురాజ్‌పల్లి అనే గ్రామంలో ప్రతి రెండు సంవత్సరాలకు ఒకసారి "పెద్దగట్టు" జాతర జరుగుతుంది.

ఈ పెద్దగట్టు జాతరను గొల్లగట్టు జాతర, యాదవులగట్టు జాతర, దురాజ్‌పల్లి జాతర అని కూడా పిలుస్తారు. పెద్దగట్టు జాతరలో పూజింపబడే దేవుడు "లింగమంతులు". ఇది 125 సంవత్సరాలక్రితం జరిగిన సంఘటన. కొందరు గొల్లవారు దురాజ్‌పల్లి ప్రాంతంలో గొర్రెలను మేపడానికి వెళతారు. వారిలో ఒక వ్యక్తికి ఒక విగ్రహం కనిపిస్తుంది. అందరు కలిసి ఆ విగ్రహాన్ని ప్రతిష్టించి లింగ మంతులు అనే పేరుతో పూజిస్తున్నారు. ఈ జాతరను మొదట్లో గొల్లకులం వారు మాత్రమే జరుపుకునేవారు. ఇప్పుడు అందరూ చేస్తున్నారు.

## జాతర చేసే విధానం

ఈ జాతరను ప్రతి రెండు సంవత్సరాలకు ఒకసారి ఫిబ్రవరి నెలలో చేస్తారు. దురాజ్‌పల్లి గ్రామంలోని గొల్లకులస్తు లందరు ఒకచోట సమావేశమయి జాతర ఎప్పుడు జరపాలో నిర్ణయిస్తారు. తరువాత ఒక సోమవారం నాడు దేవుడి గుడి వద్దకు వెళతారు. అందరు అక్కడ ఉన్న కోనేటిలో స్నానం చేస్తారు. ఆ తరువాత బిందెలతో నీరు తెచ్చి దేవుణ్ణి, గుడి ప్రాంగణాన్ని శుభ్రం చేస్తారు. ఆ తరువాత బోనం వండుతారు. పాలు, బియ్యం, బెల్లం కలిపి పరమాన్నం (బోనం) వండి దేవుడికి నైవేద్యం పెట్టి, ఆ ప్రసాదాన్ని అందరూ తింటారు. దీనిని 'జిట్టిపోయడం' అంటారు. ఈ జిట్టి పోసిన తరువాత మధ్యలో ఒక సోమవారం విడిచి పెట్టి మూడవ సోమవారం నాడు జాతర చేస్తారు. మొదట్లో అక్కడికి గొల్లవారు తప్ప ఎవరిని రానిచ్చేవారు కాదు. ఇప్పుడు అందరు వెళుతున్నారు.

## గంపలు వెళ్ళడం

జాతర చేసే సోమవారానికి ముందు వచ్చే ఆదివారంనాడు రాత్రి దేవుని గుడికి 'గంపలు వెళ్ళడం' అనే ఆనవాయితీని జరుపుతారు. పండుగ చేసేవారి ఇంట్లో గంప

ఉంటుంది. ఆ గంపలో కొన్ని బియ్యం, ఒక కుండ మొదలైన పూజ సామాగ్రి ఉంటుంది. ఆదివారం రాత్రి అందరూ కాళ్ళకు గజ్జెలు కట్టుకొని ఆడుతూ, పాడుతూ, డప్పులతో, భేరీమోతలో ఆ గంప ఉన్నవారి ఇంటికి వెళతారు. ఆ గంపను ఆ ఇంట్లో ఉన్న ఆడవారు ఎత్తి గుడివద్దకు తీసుకొస్తారు. ఎంతమంది ఈ పండుగ చేస్తే అంతమంది ఇళ్ళల్లో నుండి ఈ గంపలను తీసుకువస్తారు. దేవాలయానికి ఆ గంపలన్ని సోమవారం ఉదయం 6 గంటల వరకు చేరతాయి. దీనినే గంపలు వెళ్ళడం అంటారు. సోమవారం ఉదయం ఏడు గంటలకు గంపలలోని బియ్యంతో బోనం వండి దేవుడికి నైవేద్యం పెడతారు. అలాగే 11, 12, గంట సమయంలో అందరూ బోనాలు సమర్పించుకోడం, గొర్రెలను బలి ఇవ్వడం చేస్తారు. దేవుడికి గొర్రెలను బలి ఇచ్చేటప్పుడు పాటలు పాడుకుంటూ గుడిచుట్టు మూడు ప్రదక్షిణలు చేస్తారు. అందరూ బలి ఇచ్చిన జంతువుని అక్కడే వండుకుని తింటారు. అక్కడకు వచ్చిన వారందరూ భోజనం చేసిన తరువాత పాటలు పాడుతారు. నృత్యాలు చేస్తారు. కోలాటం ఆడతారు. పిల్లలు, పెద్దలు ఉయ్యాలలూగుతారు. సోమవారం రాత్రి అందరూ గుడి వద్దే నిద్రిస్తారు.

మంగళవారం నాడు సాయంత్రం గొల్లవారు బావ, బావమరుదులు వేషాలు వేసు కుంటారు. బావలు రాజుల వేషం, బావమరుదులు పూజారుల వేషం వేస్తారు. వీటినే వారు “కుకులు” అని అంటారు. రాజులు కుకులకు ఏవైనా తినుబండారాలను తినిపిస్తారు. అలాగే బావలు బావమరుదులకు కావలసినవి షాపులలో నుండి తీసుకొని ఇస్తారు. షాపుల వాళ్ళు వాటిని ఉచితంగానే ఇస్తారు.

## పొడుపు గొర్రె పొడవడం

గొల్లలు గొర్రెలను మందలో కలుపుతారు. ఒక పెద్ద గొల్ల, ఒక చిన్న గొల్లతో నేను ఒక గొర్రెను చూపిస్తాను, నీవు ఆ గొర్రెను పట్టుకోవాలి అంటాడు. ఆ గొర్రెల మందలో సుమారు 2000 నుండి 3000 గొర్రె లుంటాయి. అందులో పెద్దగొల్ల చూపించిన గొర్రెను చిన్నగొల్ల పట్టుకొని తెస్తాడు. ఆ తరువాత వారు ఆ గొర్రెను దేవుడికి బలి ఇస్తారు. ఆ బలి ఇచ్చిన గొర్రెను మంగళవారం రాత్రి బోనం వండి, మూడు ముద్దలు చేసి గుడి ప్రాంగణంలో అందరి సమక్షంలో ఆ ముద్దలను పెద్దగొల్ల పైకి ఎగుర వేస్తాడు. ఆవిధంగా పైకి విసిరిన ముద్ద అందరిమీద పడుతుంది. దాన్ని వారు “మాస్కారిముద్ద” అంటారు. అదిపడితే మంచిదని వారి నమ్మకం. ఆ తరువాత అందరు వారి వారి గ్రామాలకి వెళ్ళిపోతారు. ఈ జాతరను పై విధంగా ప్రతి రెండు సంవత్సరాలకు ఒకసారి జరుపుకుంటూ ఉంటారు.

**ఉపయుక్త గ్రంథాలు**


1. కృష్ణకుమారి, నాయని. 1990. తెలుగు జానపద గేయ గాథలు. తెలుగు అకాడమి, హైదరాబాదు.
2. మోహన్, జి.యస్. 2010. జానపద విజ్ఞానాధ్యయనం. ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పం.
3. ప్రతాపరెడ్డి, సురవరం. 2007. ఆంధ్రుల సాంఘికచరిత్ర. చరిత్ర ఇంప్రెషన్స్, హైదరాబాదు
4. సుందరం, ఆర్వీయస్. 2004. ఆంధ్రుల జానపద విజ్ఞానం. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు.
5. క్షేత్ర పర్యటన.




# 12. పెద్ద పండుగ - పరిశీలన

**మ**న సంస్కృతిలో పండుగలు, జాతరలు, ఉత్సవాలు, ఆచార సంప్రదాయాలు ఒక భాగం. మన దేశంలో అనేక పండుగలు, జాతరలు, తిరునాళ్ళు, ఉత్సవాల, తీర్థాలు, కొలుపులు, పరసలు జరుగుతాయి.

**పండుగ**

ఆర్.ఎస్.బాగ్స్ పండుగని నిర్వచిస్తూ "సాంఘిక సంక్షేమం కోసం విశేష సందర్భాలలో జానపద విశేషాలు, సంప్రదాయాల కలబోతగా ఆచరించే సంక్షిప్తమైన అంశమే పండుగ" అన్నాడు.

*(జి.యస్.మోహన్ : 2010, 209)*

పర్వం శబ్దం నుంచి 'పబ్బం, పండుగ' అనే రూపాలు సిద్ధించాయి. పండుగలు ఒక నిర్దిష్ట కాలానికి సంబంధించినవిగా చెప్పవచ్చు. పర్వం అంటే కాల విభజన, పర్వ కాలంలోని ఆచరణే పండుగ, ప్రతి సంవత్సరం విశేష సందర్భాలలో జన సంక్షేమం కోసం ఏర్పడ్డ ఆచరణ సంప్రదాయమే పండుగ. పర్వం తద్భవ రూపం పబ్బం అనీ, పబ్బానికీ, పండుగకీ వ్యత్యాసం కన్పిస్తుందన్న అభిప్రాయం ఉంది.

ఒకే పండుగను ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్కలా జరుపుకుంటారు. సాధారణంగా అన్ని ప్రాంతాల వాళ్ళు జరుపుకునే పండుగలు వినాయక చవితి, దసరా, దీపావళి, సంక్రాంతి, ఉగాది, శ్రీరామనవమి మొదలగునవి. ఒకే గ్రామంలో నివసించే వేర్వేరు వర్గాల వారు వేర్వేరు విధానాలను అవలంబించి ఈ పండుగలను చేసుకుంటారు.

చాలా మంది జాతరను పండుగను ఒకటిగా భావిస్తారు. జాతర జరిగే సమయంలో పండుగ చేస్తారు. కాని అన్ని పండుగలకు జాతర చేయరు. పండుగ ఒక కుటుంబానికి సంబంధించింది. అటువంటిదే తెలంగాణ రాష్ట్రంలోని పెద్ద పండుగ. ఈ పండుగను ఒక కుటుంబంవారు కాకుండ, ఒక కులంవారు జరుపుకుంటారు.

## పెద్ద పండుగ

తెలంగాణ రాష్ట్రంలో పెద్ద పండుగను చేస్తారు. బీరయ్య దేవునికి చేసే పండుగను పెద్దపండుగ అంటారు. బీరయ్య దేవుని తండ్రి శంకరుడు. మల్లిఖార్జున స్వామి అతని సోదరుడు. అక్కమాంబ సోదరి. వీరి కుటుంబంలో జరిగిన కొన్ని సంఘటనల గురించి ఈ పండుగలో కథలుగా చెబుతారు.

ఈ పెద్ద పండుగను కురుమ కులం వాళ్ళు నిర్వహిస్తారు. మిగతా గ్రామ ప్రజలు పండుగలో పాలుపంచుకుంటారు. బీరయ్య దేవునికి పూజ చేసే జానపద పూజారులను బీర్నోళ్ళు అని పిలుస్తారు. ఈ పండుగను కొన్ని చోట్ల ఐదు సంవత్సరాలకు ఒకసారి చేస్తారు. కొన్ని చోట్ల మూడు సంవత్సరాలకు ఒకసారి చేస్తారు. శుక్రవారంనాడు పండుగను మొదలు పెట్టి శుక్రవారంతో ముగిస్తారు. బీరయ్య దేవుని గుడి ఊరి చివర పొలాలమధ్య ఉంటుంది. బీరయ్య దేవుని గుడి ప్రక్కనే సోదరి అయిన అక్కమాంబ గుడి కూడా ఉంటుంది. ఈ రెండు గుళ్ళ దగ్గర లింగాలు ఉంటాయి. లింగాలనగా పుణ్యక్షేత్రాల నుండి తీసుకొచ్చిన రాళ్ళు అక్కమాంకాళి అని కూడా పిలుస్తారు. ఆ లింగాలపైన పసుపు చల్లి పూజిస్తారు. బీరయ్య దేవుని పండుగ మొదలు పెట్టడానికి 10, 15 రోజుల ముందే బీరయ్య దేవుని గుడి, అక్కమాంకాళి గుడిని కడిగి శుభ్రం చేసి సున్నం వేస్తారు. గుడిగోడలకి జాజుతో ఒకగీత, సున్నంతో ఒక గీత వరుసగా గీసి అలంకరిస్తారు.

పండుగకు వారం రోజుల ముందు నుండి కురుమ కులంవారు ఇంటికి ఒకరు చొప్పున అందరూ కలసి డోలు, తాళాలు, పసుపుబొట్టు తీసుకొని గ్రామంలోని ప్రతి ఇంటికి వెళ్ళి బిక్ష అడుగుతారు. అంటే కుర్మ, గొల్ల (యాదవ) వారి ఇళ్ళకి మాత్రమే వెళతారు. ప్రతి ఇంటివారు బియ్యం, నూనె, డబ్బులు, బిక్షగా వేస్తారు. తరువాత ఇంట్లో వాళ్ళందరికి పసుపు బొట్టు పెడతారు. పక్క గ్రామాలకు కూడా వెళ్ళి బిక్ష అడుగుతారు.

### 1. మొదటి రోజు పండుగ

పండుగ మొదటి రోజు అనగా శుక్రవారం మధ్యాహ్నం లేదా సాయంత్రం పోచమ్మకు బోనాలు పెడతారు. ఒక కొత్త కుండలో బియ్యం పసుపు వేసి అన్నం వండి, ఆ కుండను పసుపు కుంకుమలతో పూజిస్తారు. కుండకు పూలమాల, వేపకొమ్మలు కడతారు. కుండపైన మట్టి ప్రమిదను ఉంచుతారు. దీనిని కంచుడు అంటారు. దీనిలో నూనె పోసి వత్తి వేసి దీపం వెలిగించి గుడికి తీసికెళతారు. ఇదే విధంగా ప్రతి ఇంటి నుండి ఒక బోనం గుడికి తీసికెళ్ళి, ఆ బోనాలను, గుళ్ళోను, గుడి ముందు గుడి చుట్టు పెడతారు. ఈ విధంగా 10, 15 మంది బీర్నోళ్ళు పూజచేస్తారు. ఆ బోనాలను పోచమ్మకు నైవేద్యంగా సమర్పిస్తారు. అలాగే కొందరు గొర్రెలను మేకలను నైవేద్యంగా సమర్పిస్తారు. పూజ పూర్తయిన తరువాత ఎవరి నైవేద్యాలను వాళ్ళు ఇంటికి తీసికెళతారు. ఈ విధంగా మొదటి రోజు పూజ పూర్తవుతుంది.

## 2. రెండవ రోజు పండుగ

పండుగ రెండవ రోజు అనగా శనివారం నాడు లింగాలను ఒక గొంగడిలో ముల్లెకట్టి ఆ గ్రామంలోని మంచి బావిలో వేసి వస్తారు. రెండవరోజులో ప్రధానమైనది గంగబోనం. దీనిని పెద్దకుర్మ వాళ్ళింట్లో వండుతారు. ఈ బోనం పెద్దదిగా ఉంటుంది. బోనం వండేటప్పుడు కురుమ వాళ్ళందరు మనిషికి కొన్ని బియ్యం ఇస్తారు. బోనం వండిన కుండని పసుపు, తెల్లపిండి, పచ్చ పిండితో (తంగెడి ఆకుపొడి) అలంకరిస్తారు. తరువాత బంతి పూలదండ కట్టి కుండపైన మట్టి ప్రమిదను పెట్టి నూనెపోసి, వత్తివేసి దీపం వెలిగిస్తారు. ఆ సమయంలో, కురుమవాళ్ళు బీర్నీలు అక్కడకు వస్తారు. బీర్నోళ్ళు, డోలు తాళాలు చప్పుడు చేస్తూ, పూజ చేసి పెద్దకురుమకి బోనం ఎత్తుతారు. పెద్దకురుమ వెనుక కురమవాళ్ళు, బీర్నోళ్ళు పాటలు పాడుతూ గుడికి వెళతారు. మధ్యలో బోనాన్ని వాళ్ళ కంటే చిన్నవాళ్ళు వరుసగా మార్చి, మార్చి ఎత్తుకుంటారు. గుడి దగ్గరకు చేరిన తరువాత బీర్నోళ్లు పూజ చేసి నైవేద్యంగా పెడతారు. ఆ నైవేద్యాన్ని కురుమ వాళ్ళందరు తీసుకుంటారు. దీనితో రెండవ రోజు పండుగ పూర్తవుతుంది.

## 3. మూడవ రోజు పండుగ

ఆదివారం నాడు మూడవరోజు పండుగ చేస్తారు. మూడవరోజు సుంకుపడతారు. అనగా పెద్దకుర్మ వాళ్ళింటి దగ్గర బియ్యం సుంకు పట్టేటప్పుడు మధ్యలో ఎరుకుల వేషం వేసి ఒక కథ చెబుతారు. సుంకు పట్టిన బియ్యాన్ని కురుమ వాళ్ళందరు మనిషికి కొన్ని తీసుకెళ్ళి, వాటితో బోనం వండుతారు. మూడవరోజు మధ్యాహ్నం పెద్దకుర్మ వాళ్ళింట్లో కొంతమంది శరీరమంతా పసుపు పూసుకొని, కాళ్ళకు గజ్జెలు కట్టుకుని బీర్నీళ్ళ వేషం వేస్తారు. వారు కత్తులు పట్టుకొని ఆడుతూ పాడుతూ లింగాలు దాచిన బావి దగ్గరకు వెళ్ళి బావిలోదూకి ఆ లింగాల మూటని పట్టుకుంటారు. అది ఎవరికి దొరుకుతుందో వాళ్ళు అదృష్టవంతులు అని అంటారు. దాన్ని తీసుకొని ఇంటికి వస్తారు. తరువాత బోనం వండిన కుండకు పసుపు, తెల్లపిండి పచ్చ పిండి (తంగేడి ఆకుపొడి) తో అలంకరిస్తారు.

బోనానికి బంతిపూల మాలను కడతారు. బోనంపై మట్టి ప్రమిద పెట్టి దానిలో నూనెపోసి వత్తిస్తారు. వేసి దీపం వెలిగిస్తారు. మొదట పెద్ద కురుమ వాళ్ళింట్లో పూజచేస్తారు. తరువాత మిగిలిన వారందరిళ్ళల్లో బీర్నోళ్ళు వెళ్ళి దీపం వెలిగించి పూజచేస్తారు. ఈ విధంగా ప్రతి ఇంటికి ఒక బోనం, ఒక మంగళ హారతి ఉంటుంది. బీర్నోళ్ళు ఈ బోనాలన్నింటిని రాత్రి పాటలు పాడుకుంటూ కథలు చెప్తూ గుడికి తీసుకొని వెళతారు. వీరు గుడికి వెళ్ళే సరికి తెల్లవారుతుంది. ఆ తరువాత బోనాలను గుడిపక్కకు పెడతారు. తరువాత ఎవరింటికి వాళ్ళు వెళతారు. ఈ విధంగా మూడవ రోజు పండుగ పూర్తవుతుంది.

## 4. నాల్గవరోజు

నాలుగో రోజు సోమవారం కురుమవాళ్ళ గొట్టెల మందల్ని, బీరయ్య దేవుని గుడి దగ్గర్లో ఉంచుతారు. ఆ గొట్టెలకు కావలి భోయిడి భోగన్న అనే వేషం వేసి ఉంచుతారు. బీర్నాలలో ఒకతను గావుపడతాడు. దానికోసం ఆ మందలో తన కిష్టమైన గొర్రెని తీసుకొని జనాలని తరుముతూ భయపెడుతూ అటూ ఇటూ పరిగెత్తుతూ ఉంటాడు. ఆ తరువాత గొట్టె మెడని ఒకేసారి కొరికి వేస్తాడు. దీనినే గావు పట్టడం అంటారు. అంతేగాక ఇదే రోజు కురుమోళ్ళ ఇళ్ళపైన సరుగు వేస్తారు. సరుగు అంటే ఐదు రకాల ఆకు, కల్లు, గొట్టె రక్తం మొదలైనవి. వేసి సరుగు తయారు చేస్తారు. ఈ సరుగు ఇంటిపై వేయడం వల్ల ఇంట్లో వాళ్ళందరు సంతోషంతో ఏ బాధలు లేకుండా ఉంటారని వాళ్ళ నమ్మకం. ఈ విధంగా నాల్గవరోజు పండుగ పూర్తవుతుంది.

## 5. ఐదవరోజు

ఐదవరోజు మంగళవారం ఊరి మధ్యలో పెద్ద పీటలు వేసి, ఎల్లమ్మ వేషం, గారడివేషం వేసి కథ చెబుతారు. గారడివేషం వేసిన అతను చెంపలకు సూదులు గుచ్చుకుంటాడు. కాని రక్తం రాదు. అలాగే మామిడి పీచుతో చెట్టు బొమ్మలు చేసి వాటిని గుడి చుట్టు పెడతారు. ఆ తరువాత అది పెరిగి పెద్దదై పూతపూసి కాయలు కాసినట్లు చూపిస్తాడు. అదేవిధంగా బాణీలో నూనె మరుగుతుండగా బజ్జీలు వేసి చేతితో తీస్తాడు. వాటిని పైకి విసురుతాడు. దానిని ఎవరు అందుకుంటే వాళ్ళు చాలా అదృష్టవంతులని వారి నమ్మకం. ఈవిధంగా ఐదవరోజు పండుగ పూర్తవుతుంది.

## 6. ఆరవరోజు

పండుగ ఆరవరోజు బుధవారం నాగెల్లి బోనాలుంటాయి. ఈ రోజు ప్రతి కురుమ ఇంటి వారు కొత్తకుండ తెచ్చి దానిలో అన్నం వండి, ఆ బోనాన్ని పసుపు, తెల్లపిండి, పచ్చ తంగేడు ఆకుపొడితో అలంకరిస్తారు. ఆ బోనానికి బంతిపూల దండ కట్టి, ప్రమిదలో నూనె పోసి వత్తి వేసి ఉంచుతారు. ఆ తరువాత ప్రతి ఇంటికి బీర్నోళ్ళు వచ్చి పూజచేసి బోనంపైన ఉన్న దీపం వెలిగించి పూజ చేస్తారు. ఆ తరువాత బోనాలు ఎత్తుకుంటారు. ప్రతిబోనంతో పాటు ఒక మంగళ హారతి కూడా ఉంటుంది. ఈ విధంగా అందరూ కలసి బోనాలు ఎత్తుకుని ఒక చోటికి చేరుతారు. వెళ్ళేదారిలో బీర్నోళ్ళు పాటలు పాడుతూ ఆడుతూ కథలు చెబుతూఉంటారు. మార్గ మధ్యలో ఒక చోట కూర్చుని సంతుల వధ కథ సగం చెబుతారు. ఈ కథ వినేటప్పుడు బోనాలు ఎత్తుకున్నవాళ్ళు కుర్చీలు తెచ్చుకుని వేసుకుని బోనాలు చేతిలో పట్టుకొని కూర్చుంటారు. ఈ విధంగా తెల్లవారు జామున నాలుగు గంటల వరకు కథ చెబుతారు. ఈ కథను ఊరు వాళ్ళందరూ అక్కడకు వచ్చి వింటారు. ఆ తరువాత మరల

బోనాలు ఎత్తుకొని గుడి దగ్గరకు వెళ్ళి మిగిలిన సగం కథను పూర్తి చేస్తారు. అపుడు బోనాల్ని గుడి చుట్టు పెడతారు. అప్పుడు బీరోళ్ళు పూజచేసి దేవుడికి నైవేద్యం పెడతారు. ఆ తరువాత అందరూ ఎవరింటికి వాళ్ళు వెళతారు. ఈవిధంగా ఆరవరోజు పండుగ పూర్తవుతుంది.

## 7. ఏడవ రోజు

బీర్నోళ్ళు అక్కమాంకాళి, బీరయ్య దేవుడి కథ చెబుతారు. ఏడవ రోజు గురువారం బీర్నోళ్ళు అక్కమాంకాళి వేషం, బీరయ్య దేవుని వేషం, కామరాతివేషం వేస్తారు. అక్కమాంకాళి కథ చెబుతారు. ఆమె చిన్నతనం నుండి తమ్ముణ్ణి ఏవిధంగా ఆడిస్తుందో చెబుతుంది. అక్కమాంకాళి తమ్ముణ్ణి ఎక్కువగా ఎత్తుకోడం వల్ల ఆమె బుజాలు, చంకలు ఏవిధంగా కాయలు కాశాయో చెబుతుంది. బీరయ్య దేవుడు పెద్దవాడు అయిన తరువాత వివాహం చేసుకుంటానని అక్కతో చెబుతాడు. అప్పుడామె చేతులకి అడ్డ జిల్లలు ఉన్న అమ్మాయిని, వీపు మీద సుడి ఉన్న అమ్మాయిని, మేనరకపు అమ్మాయిని చేసుకోవద్దని చెబుతుంది. కాని బీరయ్య దేవుడు మేనపిల్ల (మేనత్త కూతురు, మేనమామ కూతురు) కామరాతిని వివాహం చేసుకుంటాడు. అటుపిమ్మట బీరయ్య దేవుని అత్త, ఆడపడుచుని ఇంటిలో ఉంచుకోరాదని, అరిష్టం కలుగుతుందని చెబుతుంది. ఆమె మాటలు విన్న బీరయ్య దేవుడు అక్కమాంకాళిని ఇంటినుండి వెళ్ళగొడతాడు. అప్పుడు అక్కమాంకాళి ఏడుస్తూ ఈ కింది విధంగా బాధపడుతుంది.

నిన్ను చిన్నపుడు సంకనెత్తుకుంటినిగదరా!
సంకకాయకాసేగదరా
భుజానికి ఎత్తుకుంటే
భుజం కాయకాసే కదరా!
నేను ముందే చెప్పిన కదరా!
మేనపిల్లని చేసుకోవద్దని
నాటి పిల్లని చేసుకోమని

అంటూ ఏడుస్తూ చెబుతుంది. ఈ విధంగా అక్కమాంకాళి ఏడుస్తున్నప్పుడు తమ్ముడు వేరే విధంగా అర్థం చేసుకుంటాడు. ఈ కథ జరిగే సమయంలో ప్రజలందరు ఏడుస్తారు. ఈకింది విధంగా అక్క మాంకాళి తన తమ్ముడిని తిడుతుంది.

చివరకు అక్కమాంకాళి
నీ మీద మన్నుపొయ్యరా
దుమ్ము పొయ్యరా

ఈ విధంగా ఆమె తిట్టడం వల్ల బీరయ్య దేవునికి ఏమి మంచి జరగదు. బీరయ్య దేవుడు కామరాతి కొన్ని రోజులు మంచిగానే ఉంటారు. కొంతకాలం తరువాత బీరయ్య

దేవుడు అసలు విషయం తెలుసుకొని అక్కమాంకాళి వద్దకు వచ్చి బతిమాలుతాడు. బీరయ్య దేవుడు ఎంతసేపు బతిమాలినా అక్కమాంకాళి రానంటుంది చివరకు కనికరించి వస్తుంది. ఆమె రాకతో కథ పూర్తవుతుంది. ఈ విధంగా ఏడవరోజు పండుగ పూర్తవుతుంది.

## 8. ఎనిమిదవ రోజు

ఎనిమిదవ రోజు శుక్రవారం. శివసత్తులు గుండాలు తొక్కుతారు. పూనకం వచ్చే వారిని శివసత్తులు అంటారు. తరువాత అక్కమాంకాళికి కురుమ కులస్తు లందరు ఒడు బియ్యం పోస్తారు. తరువాత కురుమ ఇంటి వాళ్ళందరికి పుట్టింటి వాళ్ళు కొత్త బట్టలు పెట్టి ఒడుబియ్యం పోస్తారు. తరువాత ఎవరింటికి వాళ్ళు వెళతారు. ఈ విధంగా ఈ పెద్దపండుగ ముగుస్తుంది.

## ముగింపు

ఈ విధంగా కురుమ కులస్తులు ఎంతో భక్తి శ్రద్ధలతో ఈ పండుగను జరుపుకుంటారు. ఈ పండుగ చెయ్యడం వల్ల గ్రామాలలో క్షామం ఏర్పడకుండా ఉంటుందని, వర్షాలు కురిసి, పంటలు బాగా పండుతాయని నమ్ముతారు. ఊరు సస్యశ్యామలంగా ఉంటుందని భావిస్తారు. గ్రామాలలో ప్రజలు ఎటువంటి అంటువ్యాధులు సోకకుండా ఆయురారోగ్యాలతో ఉంటారని చెబుతారు. ఈ పండుగలు, జాతరలు, తిరునాళ్ళు, కొలుపులు మొదలయిన వాటివల్ల ప్రజల సంస్కృతి తెలుస్తుంది. వీటి ముఖ్య ఉద్దేశ్యం సమాజ శ్రేయస్సు. ఈ దిశగా ఇంకా పరిశోధన జరగాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

## ఉపయుక్త గ్రంథాలు


1. కృష్ణకుమారి, నాయిని. 2007. తెలుగు జానపద గేయగాథలు. తెలుగు అకాడమి, హైదరాబాదు.
2. ప్రతాపరెడ్డి,సురవరం. 2007. ఆంధ్రుల సాంఘిక చరిత్ర. చరిత్ర ఇంప్రెషన్, హైదరాబాదు.
3. మోహన్, జి.యస్. 2010. జానపద విజ్ఞానాధ్యయనం. ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పం.
4. క్షేత్రపర్యటన.


